# విజ్ఞాన నిధి
## (The Pool of Knowledge)




విద్యోదయా పబ్లికేషన్స్,
కడప.

1st Impression March 1957.

"The Pool of Knowledge"
How the United Nations Share their Skills
by Katherine B. Shippen.
Published by Harper & Brothers, Publishers.
Newyork.


Published in Telugu by R. Ramachandra Reddy, Proprietor, Vidyodaya Publications, Cuddapah and Printed in Sree Lalitha Printers, Cuddapah.

# విజ్ఞాన నిధి
## (The Pool of Knowledge)

మూలం:

కాథరిన్. బి. షిప్పెన్

అనువాదం:

రాచమల్లు

విద్యోదయా పబ్లికేషన్స్,
కడప.

# ముందుమాట.

అమెరికా వంటి దేశాలు కొన్ని అభివృద్ధినీ ఐశ్వర్యాన్నీ సాధించుకున్నాయి. ఆ దేశాల ప్రజలకు బడుగుదేశాల ప్రజల దైనిక జీవితాలలో వుండే బాధలు సులభంగా అర్థంకావు. అవి అర్థం కావటానికి ఈ గ్రంథం తోడ్పడుతుందని నా నమ్మకం. సువిశాలమైన స్వాతంత్ర్య పరిధిలో జీవన ప్రమాణాలను పెంచుకోటానికి బడుగు దేశాలలోని కోటాను కోట్ల ప్రజలు ప్రయత్నిస్తున్నారు. ఈ ప్రయత్నానికి తోడ్పడటము తమ కర్తవ్యమని ఐక్యరాజ్య సమితి తన నియమావళిలో ప్రకటించుకుంది. అది ఏ విధంగా తోడ్పడేదీ ఈ గ్రంథంవలన పాఠకులకు కొంతైనా తెలుస్తుందని నా దృఢ విశ్వాసం.

"నాగరకత వలని సౌకర్యాలను మానవజాతి కంతటికీ అందుబాటులోకి తేవటం సాధ్యమని నమ్మే సాహసం చరిత్రలో మొదటిసారిగా మన యుగంలోనే కల్గింది. ఈ సాహసం మూలంగానే మనయుగం చాలా గుర్తింపబడుతుంది." అని ప్రసిద్ధ చరిత్ర కారుడు ఆర్నాల్డ్ టోయిన్‌బీ ఒకప్పుడు సూచించినాడు

ఈ నమ్మకాన్ని ఐక్యరాజ్య సమితి ఆచరణలోకి తెచ్చింది. ఐక్యరాజ్య సమితియొక్క సహాయం పరిశోధనలకూ, చర్చలకూ సంబంధించికాదు. అది ఆగ్నేయ ఆసియాలోని వరిమళ్లకూ, మధ్యప్రాచ్యంలోని ఎడారులకూ, దక్షిణ అమెరికాలోని పీఠభూముల మీది మైదానాలకూ ప్రయోజనం కల్గించేది. ఈ ఉద్దేశంతోనే ఐక్యరాజ్య సమితి, దాని అనుబంధ సంస్థలూ కలిసి ఒక సాంకేతిక సహాయ ప్రణాళికను ప్రారంభించినాయి. సాంకేతిక విజ్ఞానమూ, అనుభవమూ లేకుంటే ఆర్థికాభివృద్ధి కుంటుపడక తప్పదు. ప్రత్యేక శిక్షణా, అనుభవమూ పొందిన స్త్రీ పురుషులు — అవసరానికి మించిన దేశాలవారు — తమ విజ్ఞానాన్నీ, అనుభవాన్నీ అవసరమైన వారికి అందివ్వటానికి కృషిచేస్తున్నారు.

ఈ ఐక్యరాజ్య సమితి నిపుణులను ఎదుర్కొనే సమస్యలను, వాటి పరిష్కారానికి వారు యేవిధంగా సహాయ పడేదీ సూచించడానికి కొన్ని వందల ఉదాహరణ లున్నాయి. వాటిలో కొన్నింటిని మాత్రమే ఈ రచయిత్రి ఉపయోగిస్తున్నది. మానవజాతిని ఎదుర్కొన్న సమస్యలోని సమ్మోహన గుణాన్ని ఈమె కొంత వరకూ గ్రహించింది. అట్లు గ్రహించి ఈ గ్రంథంద్వారా అంతర్జాతీయ సామరస్యానికి అధికంగా సార్థకంగా సహాయం చేసింది.

(సం.) బెంజమిన్ కోహెన్,
ఐక్యరాజ్యసమితి పౌరసమాచారశాఖా సహాయ కార్యదర్శి.

# విషయ సూచిక.

ముఖచిత్రం: ఎల్ సాల్వడార్ యువతి.

# 1. 240,00,00,000 ప్రజలు.

ప్రపంచంలో సుమారు 240,00,00,000 ప్రజలున్నారు. ఈ సంఖ్యను అర్థంచేసుకోవటం చాలాకష్టం. వారు చైనా, యిండియా, రష్యా, బర్మా, తాయిలాండులలోనూ; ఫిలిప్పైన్, జపాన్ దీవుల లోనూ; ఆఫ్ఘనిస్తాన్, లైబీరియా, నైజీరియా, ఈజిప్టు, బొలీవియా, పెరూవియా, బ్రెజిల్ దేశాలలోనూ; యూరప్, కెనడా, సంయుక్త రాష్ట్రాలలోనూ వున్నారు.

కేవలం జనసంఖ్యను అర్థంచేసుకోవటమే కష్టమైతే, ఆ జనులలో సగానికిపైగా ఆకలితో అలమటిస్తున్నారని అర్థం చేసుకోవటం మరీకష్టం. వారికి చాలినంత తిండిగాని, తగినన్ని యిండ్లుగానీలేవు. దారిద్ర్యంతోబాటు అనారోగ్యమూ, అజ్ఞానమూ, అసంతృప్తి వారిని పీడిస్తున్నాయి.

ఒకప్పుడు లోకం ఈ పరిస్థితిని గుర్తించలేదు. చైనాదేశపు గ్రామాలలో స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ ఎంతమంది వుండేదీ యెవ్వరికీ తెలియదు. జపాను దీవులలో యెంతమంది క్రిక్కిరిసి వుండేదీ, ఇరాన్ మైదానములలోనూ, బొలివియా, పెరూ పర్వత ప్రాంతములలోనూ యెంతమంది జీవిత పోరాటముతో సత మత మయ్యేదీ, యెవ్వరికీ తెలియదు. "ఐనా ఆ విషయాలతో

మాకేంపని? మా బ్రతుకులే మాకు భారంగా వున్నాయి. ఎక్కడైనా జనసంఖ్య అధికంగావుంటే, అధికమైనవారు చావనీ; వున్నవాళ్లకైనా తిండి దొరుకుతుంది." అని లోకులనుకునేవాళ్లు. కానీ వాళ్లనుకున్న ప్రకారం జనులు చావలేదు; పైగా యెక్కువే ఐనారు. జనసంఖ్య విపరీతంగా పెరిగింది. శాస్త్రజ్ఞులకు తెలిసినంత వరకూ గత శతాబ్దంలో జనసంఖ్య పెరిగినట్లు, అంతకు పూర్వమెన్నడూ పెరుగలేదు. ఏటేటా 250,00,000 మంది అధికమౌతున్నారు.

ఈ ప్రజాభివృద్ధి నేల యీనినట్లుందని ఒక రచయిత అన్నాడు. సంపన్న దేశాలలోకంటే బడుగుదేశాలలోనే ప్రజావృద్ధి యెక్కువగా వుందనికూడా ఆయన అన్నాడు.

సంపన్న దేశాలలోని ప్రజల సౌభాగ్యానికి కారణాలేమో ఆ ప్రజలకే తెలియదు. ఇతరులకులేని సద్గుణాలేవో తమ కున్నట్లు కొందరి భావన. (నాకున్న తెలివి తేటలు వాళ్లకూవుంటే వాళ్లెందుకు కష్టపడ్తారు? అని వాళ్లవాదం.) అది కేవలం అదృష్టమేనని మరి కొందరి ఊహ. (వాళ్ల దురదృష్టం నాకు పట్టక పోవటం చాలా సంతోషకరం. అని వాళ్ల తృప్తి.) ఇతరులకు ఆవూసే పట్టలేదు. (నేనెప్పుడూ చూడబోని వారిని గురించి ఆలోచించటానికి నాకు తీరికలేదు. అని వాళ్ళ సమర్థన.)

బ్రిటిషు ఆర్థిక శాస్త్రవేత్త, థామస్ మాల్థుస్, వ్రాసిన "జనాభా పెరుగుదలను గురించిన వ్యాసాన్ని" చాలామంది చదివి

నారు. అది 1798లో ప్రకటింప బడింది. దాని తర్వాత జనాభా పెరుగుదలను గురించి అంతకు మించిన పరిశీలన జరుగలేదు. జనవృద్ధి అయినంత వేగంగా ఆహారవృద్ధి కావటంలేదనీ, అందు వలన చాలామందికి చాలినంత తిండి దొరుకుతుందనే ఆశలేదనీ, జనసంఖ్య అపరిమితంగా పెరిగినప్పుడు యుద్ధాలూ, కరువులూ, రోగాలూ జనసంఖ్యను తగ్గిస్తాయనీ మాల్థుస్ సిద్ధాంతం. ఈ సిద్ధాంతం క్రూరమైన రాక్షస సిద్ధాంతమే. ఐనా ఇంతకంటె మంచి సిద్ధాంతాన్నిగురించి మొన్న మొన్నటివరకూ ఎవరూ అనుకోలేదు.

"యుద్ధాలువస్తే జనులుచస్తారు. జనులుచస్తె జనసంఖ్య తగ్గుతుంది" అనే అభిప్రాయంతో చాలామంది యుద్ధాలకు సుముఖులైనారు "జనసంఖ్యను అదుపులో వుంచటానికి కరువులూ, అంటువ్యాధులూ ప్రకృతి సిద్ధములైన మార్గములు" అని కూడా వారి నమ్మకం.

అయితే ఈ దౌర్భాగ్యాలన్నీ యితరులకేగానీ తమకుగాదని వారి ఊహ. ఈ విధంగా కాలం గడిచేకొలదీ తిండిగలవాళ్ళకూ తిండిలేనివాళ్ళకూ, ఆరోగ్యవంతులకూ అనారోగ్యవంతులకూ, విద్యావంతులకూ విద్యాహీనులకూ, మధ్యనున్నతేడా యెక్కువైంది.

కాని యిప్పుడు ప్రజల మనస్సుల్లో వాళ్లకు తెలియకుండానే ఒక మార్పువచ్చింది. ఈ మార్పుకు కారణం ఒకటిగాదు. సముద్రాలకూ పర్వతాలకూ ఎడారులకూ ఈ వైపునా ఆ వైపునా

వున్నవారు ఒకరిని గురించి ఒకరు తెలుసు కొన్నారు. ముడి సరుకుల కొరకు పారిశ్రామికులు ఎన్నడూ యెరుగని దేశాలన్నీ గాలించినారు. యుద్ధరంగాల నుండి తిరిగి వచ్చిన సైనికులు దూరదేశస్థుల ఆచారాలను వర్ణించి చెప్పినారు; దక్షిణ సముద్ర వాసులను గురించి పుస్తకాలు వ్రాసినారు; భారత దేశంనుండి కంకణాలూ, సింహళంనుండి 'ఎబనీ' అనే నల్లకొయ్యతో చేసిన ఏనుగబొమ్మలూ, మధ్యప్రాచ్యంనుండి సొగసైన చొక్కాలూ యిండ్లకు తీసుకొని వచ్చినారు. ఆ సైనికులను వారి స్నేహితులు దూరదేశస్థులను గురించి అనేక ప్రశ్నలువేసి తెలుసుకొను చుండిరి.

ఈ లోగా వేగవంతములైన ఓడలూ, విమానాలూ మానవులను ఒకరి నొకరికి మరింత దగ్గరకు తెచ్చినాయి. ఉదయం పారిస్‌లో బయలుదేరి మధ్యాహ్నానికి కెయిరోకుగానీ, మరుదినం కేప్‌టౌనుకుగానీ పోవచ్చును. వ్యాపారస్థులూ, ప్రయాణికులూ, గుంపులు గుంపులుగాపోయి ప్రపంచమంతా గాలిస్తున్నారు గాబట్టి భూగోళమే చిన్నదైనట్లుంది. నిత్య పరిచయం వలన విదేశీయులు గూడా తమ వంటివాళ్లేనని అనుకుంటున్నారు. ఇండియా, చైనాల లోని అసంఖ్యాక ప్రజాసమూహాలూ, పెరూ బొలీవియాలలోని రంగుజాతి ప్రజలూ, కాళ్ల క్రిందపడి నలిగే చీమలవలె మరచి పోదగినవారు కాదని తెలుసుకున్నారు.

1942లో వెండల్ విల్కీ అను అమెరికన్ ప్రముఖుడు తన ప్రాచ్యదేశాల పర్యటన ముగించుకొనివచ్చి "ప్రపంచ మంతా

ఒకటే'' అను భావాన్ని ప్రచారంలోకి తెచ్చినాడు. వివిధదేశాల ప్రజల సౌభాగ్యాలకు పరస్పర సంబంధం వుందని ఆయన అన్నాడు. చైనా తత్వవేత్త అగు కన్‌ఫ్యూషస్ ఈ విషయం కొన్ని శతాబ్దాలకు పూర్వమే చెప్పినాడు. ఆయన అనుయాయులకు అది తెలిసిన విషయమే. "నాలుగు సముద్రాల చుట్టూ వున్న మానవులంతా సోదరులే'' అను "కన్‌ఫ్యూషస్'' సూక్తిని విల్కీ పర్యటన తర్వాత పాశ్చాత్యులు ఉదహరింప సాగినారు. అంతకు పూర్వం చాలామంది ఆసూక్తిని విన లేదు.

'ప్రపంచమంతా ఒకటే' అనే భావం చాలా విలువ గలది. ఒక జాతియొక్క కృషి, సౌభాగ్యం, ఆరోగ్యం వీటితో సంబంధం లేకుండా యితర జాతుల కృషీ, సౌభాగ్యం, ఆరోగ్యం, వుండలేవు. అంటు వ్యాధులవలెనే అసంతృప్తీ, నిస్పృహ ఒక దేశంనుండీ మరొక దేశానికి ప్రాకుతాయి. ప్రస్తుత పరిస్థితుల్లో యావత్ప్రపంచమూ బాగుపడితేనేతప్ప యేఒక్క దేశమూ బాగుపడలేదు. మొత్తము ప్రపంచంలో సగంమందికి ఆకలి తీరటంలేదు; వారి ఆకలి తీరితే ప్రపంచం కొంత బాగుపడినట్లే.

పశ్చిమ దేశాలలో పైభావాలు కలుగు చున్నప్పుడు ఆఫ్రికా, ఆసియా, మధ్యప్రాచ్యాల ప్రజలలో క్రొత్తభావాలు రేకెత్తు చుండి నాయి. తర తరాలుగా వారు జీవిత భారాన్ని శిరసావహిస్తూ వచ్చినారు. బండచాకిరీ, ఆకలీ, బాధలూ, వ్యాధులూ, వరదలూ, కరువులూ – ఇవేవారి జీవిత విశేషాలూ. వీటి నన్నిటినీ వారు విధి

క్రొత్తగా అంగీకరిస్తూ వచ్చినారు. వారు యెప్పటికి దరిద్రులుగా వుండవలసిందేనా? వ్యాధులు నయంచేయటానికీ, వరదలు నివారించటానికీ, ఆహారం అధికంగా పండించటానికి మార్గాలేమీ లేవా? ఈ ప్రశ్నలు వారిలో క్రొత్తగా పుట్టినాయి - అందరిలోనూ కాకపోయినా తగినంత మందిలో. దావాగ్నివలె ఈ భావాలు వ్యాపించినాయి. "సుఖాలెఱుగ కుండామేమెందుకు చావాలి? మా భూములు ఎక్కువ పంట పండె మార్గాలులేవా?" అందరిలోనూ ఇవే ప్రశ్నలు.

"ఇంతకంటె సుఖంగా బ్రతికేమార్గం మనం కనిపెట్ట లేమా?" అనే ప్రశ్న వరిమళ్లలో, తేయాకు తోటల్లో, గొర్రెల మందల చుట్టూ - ఎక్కడబడితే అక్కడ వినబడుతూ వచ్చింది.

ఒకవైపున వారు ఈవిధంగా ప్రశ్నించుకొనేటప్పుడే, మరొక వైపున "శాన్‌ఫ్రాన్సిస్కో"లో, **1945**లో ఐక్యరాజ్యసమితి తన నియామవళిని తయారు చెసుకుంటూ వుండింది.

రాబోయే తరాలవారికి యుద్ధభయం లేకుండాచేసి, నిరుద్యోగాన్ని రూపుమాపి, ఉత్తమ జీవన ప్రమాణాలనూ, ఆర్థిక సాంఘికాభివృద్ధినీ సాధించేందుకు కృషిచేయాలని సభ్యదేశాలకు ఈ నియామావళి విధించింది.

అంటే ప్రపంచ వ్యాప్తంగా ఆకలితో, అనారోగ్యంతో, నిరాశతో బాధపడేవారికి అందరూ చేతనైన సహాయం చేయాలని

అర్థం. అసగా యుద్ధాలు నివారించడమే గాక బడుగుదేశాలను ఉద్ధరించి, ఆ దేశాల ప్రజలకు తృప్తి, ఆరోగ్యం, స్వేచ్ఛా కల్గించేందుకు ఐక్యరాజ్యసమితి పూను కుంటుందని అర్థం.

---

# 2. విజ్ఞాన నిధి.

ప్రపంచంలోని ఆకలీ, దారిద్ర్యం, రోగాలూ, అంతర్జాతీయంగా తప్ప పరిష్కారం కావనేభావం క్రొత్తదిగాదు. కార్మిక వ్యవహారాలూ, ఆరోగ్యం, రవాణా, ఆర్థిక విషయాలూ — వీటిని గురించి వ్యవహరించటానికి పాతికేళ్ళక్రితమే అనేక అంతర్జాతీయ సంస్థలు అవతరించినాయి. ప్రతి సంస్థకూ ప్రత్యేకంగా స్వంత నియమావళీ, స్వంత సభ్యత్వమూ వుండేవి.

ఈ సంస్థలన్నీ కలిసి పనిచేస్తే యెక్కువ ఫలప్రదంగా వుంటుందని, 1949లో, ఐక్యరాజ్యసమితి యొక్క ఆర్థిక సాంఘిక సంఘం తీర్మానించింది. "బడుగుదేశాల ఆర్థికాభివృద్ధికొరకు విస్తృత సాంకేతిక సహాయ ప్రణాళిక"లో చేరటానికి ఈ సంస్థ లన్నీ ఆహ్వానింప బడినాయి. అంతర్జాతీయ కార్మిక వ్యవహారాల సంస్థా, ఐక్యరాజ్యాల ఆహార వ్యవసాయసంస్థా, ఐక్యరాజ్యాల విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక సంస్థా, అంతర్జాతీయ వాయు యానసంస్థా, ప్రపంచ ఆరోగ్యసంస్థా, ప్రపంచ వాతావరణ పరిశోధకసంస్థా, అంతర్జాతీయ వార్తాప్రసార వ్యవహారాలసంస్థా ఈ ప్రత్యేక సంస్థలన్నీ దానిలో చేరినాయి. ఈ సంస్థల ప్రతినిధు లందరూ కలిసి సాంకేతిక సహాయ సంస్థను స్థాపించినారు. అభివృద్ధి పునర్నిర్మాణాల అంతర్జాతీయ బ్యాంకి, అంతర్జాతీయ

ద్రవ్యనిధి పైవారితో సహకరించటానికి ఒప్పుకున్నాయి. ఈ సంస్థలన్నింటి యొక్క కృషిని సుసంఘటిత మొనర్చటానికి సాంకేతిక సహాయ సంస్థ 1950 ఫిబ్రవరిలో సమావేశమై, ఆ వెంటనే పని ప్రారంభించింది. ప్రపంచ వ్యాప్తంగా బడుగుదేశాల ప్రజల ఆకలినీ, అజ్ఞానన్నీ, అనారోగ్యాన్నీ, దైన్యస్థితినీ నిర్మూలించటానికి అవసరమైన సాంకేతిక విజ్ఞానాన్ని సమకూర్చి ఒక నిధిగా ఏర్పాటు చేయడమే ఈ సంస్థయొక్క ఉద్దేశం.

వారి పథకం ప్రకారం ఐక్యరాజ్యసమితి సభ్యులెవరైనా తమకున్న అసాధారణ విజ్ఞానాన్నిగానీ, నైపుణ్యాన్నిగానీ ఆ నిధికి సమర్పించవచ్చు. అవసరమున్నవారు ఆ నిధినుండి వాడుకోవచ్చు. ఫిన్‌లాండు, ఆస్ట్రియా, స్విట్జర్లాండు వంటి దేశాలు ఐక్యరాజ్యసమితిలో సభ్యులు కాకపోయినా, ధనాన్నీ, నైపుణ్యాన్నీ ఈ విజ్ఞాన నిధికి సమర్పించినాయి, మొదట కొన్ని దేశాలు మాత్రమే సాంకేతిక సహాయం కోరినాయి. 1953 వచ్చేసరికి 96 దేశాలు సాంకేతిక సహాయం కోరినాయి; నూర్లకొలది ప్రణాళికలు ప్రారంభింపబడినాయి.

సాంకేతిక సహాయ సంస్థయొక్క సహాయం లభించిన అనేక బడుగు దేశాలలో ప్రకృతి సంపద విశేషంగా వుందిగానీ దాని ఫలితం ప్రజలు అనుభవించడంలేదు. ఆ దేశాలలో అమూల్యములైన ఖనిజా లున్నాయి; కానీ అవి భూమిలోనే వున్నాయి. అడవు లున్నాయి; కానీ కలప ఉపయోగంలోకి రాలేదు. భూము

న్నాయి; కానీ దోపుపోయో, గడ్డి గాదము బలిసో వ్యవసాయానికి పనికి రావటంలేదు. పశుసంపదవుంది కానీ రోగపీడితం.

ఈ విధంగా సంపద భూమిలో గర్భితంగా వుందిగాని ఉపయోగంలోకి రాలేదు. అదేవిధంగా ప్రజలలో అన్నిశక్తులూ వున్నాయిగానీ అవి వికసింపలేదు. వారికి సరియైన ఆహారం లేనందున నిర్వీర్యులుగానూ, ఆధునిక వైద్య విజ్ఞానం లేనందున రోగ పీడితులుగానూ వుండినారు. వసతీ, ఆరోగ్యంలేని కొంపలలో వారి నివాసం. కావలసిన వస్తువులు కొనడానికి వారికి తగిన ఆదాయం లేదు.

ఈ పరిస్థితులు యెన్నో శతాబ్దాలనుండి వున్నాయి. ఇర వయ్యో శతాబ్దంలో జనాభా పెరిగినందున ఈ పరిస్థితులు విష మించినాయి.

ఈ పరిస్థితులతో పోరాడే పద్ధతులు పాశ్చాత్య దేశాలలో కనిపెట్టబడి త్వర త్వరగా దేశ దేశాలకూ ప్రాకినాయి. ఆవిరితో, విద్యుచ్ఛక్తితో పెద్దయెత్తున పారిశ్రామిక వస్తువులు తయారైనాయి. రోగాలు నయం చేయడానికి ఆధునికశాస్త్రం క్రొత్తపద్ధతులను కని పెట్టింది. రోడ్లూ, ఆనకట్టలూ, పాఠశాలలూ, ఆస్పత్రులూ, గ్రంథా లయాలూ – ఇవన్నీ నిత్య కృత్యము లైనాయి. కావలసిన విజ్ఞాన ముంది గనుక పాశ్చాత్య ప్రజలు అంతకు ముందుకంటె ఆరో గ్యంగానూ, సుఖంగానూ వుండినారు.

ప్రపంచ ప్రజలందరూ తమ జీవన ప్రమాణాలను అభివృద్ధి చేసుకొని శాంతియుతంగా బ్రతకాలంటే బడుగు దేశాలకు సహాయమూ, సలహాలూ విరివిగా అందాలి. ఈ దృష్టితో అనేక దేశాలు అనేక ప్రణాళికలు ప్రారంభించినాయి. నార్వేదేశం ఒక సాంకేతిక సహాయ ప్రణాళికను ప్రారంభించింది. ఆసియా దేశాలకు సహాయ మివ్వటానికి ఇంగ్లాండు "కొలంబో పథకం" సృష్టించింది. 1949 జనవరిలో అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ తన ప్రారంభోపన్యాసంలో సాహసోపేతమైన ఒక క్రొత్త ప్రణాళికను ప్రకటించినాడు. ఆయన ఉపన్యాసంలో అది నాల్గవ సూత్రం గాబట్టి దానికి "చతుర్థ సూత్రం" అని పేరు వచ్చింది. ఈ విధంగా ఏ దేశమంతకు ఆదేశం స్వంతంగా ప్రణాళికలను నడపటంలో రాజకీయ ఉద్దేశాలు వుండవచ్చు. ఐనా బడుగు దేశాలకు సాంకేతిక సహాయం చాలా అవసరం గాబట్టి, ఈ ప్రణాళికలన్నీ ఉపయోగకరంగానే వుండినాయి. అందువలన ఈ ప్రణాళికలు సాగటానికి అనుమతిస్తూ, ఒకరు చేసేపనినే మరొకరు చేయకుండా వుండేందుకు తగిన తనిఖీచేస్తూ వుండవలెనని ఐక్యరాజ్యసమితి సూచించింది.

ఐక్యరాజ్యాల సాంకేతిక సహాయసంస్థ చేసిన మొట్టమొదటి పనులలో ఒకటి యేమంటే వివిధ రంగాలలో సలహాలు యివ్వగల నిపుణుల జాబితా తయారు చేయటం. ఇట్టి నిపుణులు ప్రత్యేక సంస్థలలో చాలామందివుండినా ఇంకా యెంతో మంది కావలసి వచ్చినారు. అందుచేత బడుగు దేశాలకు పోవటానికి

సిద్ధపడే నిపుణులను కూర్చుకోవడంలో తోడ్పడ వలసిందిగా వివిధ దేశాల ప్రభుత్వాలను ఐక్యరాజ్యసమితి కోరింది.

డాక్టర్లూ, నర్సులూ, భూరసాయనిక శాస్త్రజ్ఞులూ, కలప పరిశ్రమ నిపుణులూ, వృక్షశాస్త్రజ్ఞులూ, ఉపాధ్యాయులూ, శానిటరీ ఇంజనీర్లూ, వాస్తుశిల్పులూ, ఇంకా అనేక రకాల నిపుణులు కూర్చుకోబడినారు. వీరిలో చాలమంది పాశ్చాత్య పారిశ్రామిక దేశాలనుండి వచ్చినా దక్షిణ అమెరికా, మధ్యప్రాచ్యమూ, ఆఫ్రికా, ఆసియాల నుండికూడా కొందరు వచ్చినారు. ఈ దేశాలనుండి వచ్చినవారు బడుగు దేశాల సమస్యలను సానుభూతితో అర్థం చేసుకోగలరుగదా! విజ్ఞాన నిధికి విజ్ఞానం సమకూర్చటానికి అన్ని శాస్త్రప్రయోగశాలలూ, ప్రభుత్వ కార్యాలయాలూ, శాస్త్రపాఠశాలలూ, కాలేజీలూ తమ ఉద్యోగులను పంపవలసిందిగా ప్రార్థింపబడినాయి.

ఇంత పెద్ద ప్రణాళికకు ధనమెక్కడుంది? అని అందరికీ అనుమానమే. ఈ ప్రశ్న నిజంగా చాలాపెద్దది. ఐక్యరాజ్యసమితి ఒక నిధిని యేర్పాటుచేసి దానికి విరాళా లివ్వవలసిందిగా వివిధ దేశాలను అర్థించింది. 1950 జూన్‌లో 54 దేశాలు మొత్తం 2 కోట్ల డాలర్లు వాగ్దానం చేసినాయి. అప్పటినుండీ ప్రతి సంవత్సరమూ సభ్యదేశాలు క్రొత్త వాగ్దానాలు చేస్తూనే వున్నాయి.

ఆరంభింప బడిన ప్రణాళికలు అంతరాయం లేకుండా సాగటానికి ఈ నిధినుండి 30 లక్షల డాలర్లు రిజర్వునిధిగా యేర్పాటు చేయబడింది.

తక్కిన ధనాన్ని సాంకేతిక సహాయసంస్థ వివిధ శాఖలకు అప్పగించింది. ఈ ధనం నిపుణుల జీతాలకూ, ప్రయాణపు ఖర్చులకూ వాడుకోవచ్చు. బడుగు దేశాలవారు యితర దేశాలలో విద్య నభ్యసించటానికి ఈ ధనం వినియోగించవచ్చు. ప్రదర్శనాలకు అవసరమైన వస్తువులనూ, పరికరాలనూ కొనటానికికూడా ఈ ధనం ఖర్చు పెట్టవచ్చు.

సాంకేతిక సహాయార్థమైన ఈ ధనాన్ని పెట్టుబడిగా వినియోగించరాదని అందరూ అంగీకరించినారు. ఏ దేశానికైనా పెట్టుబడి కావలిసివస్తే అది వేరుమార్గాలు చూసుకోవలసిందే.

అనేక దేశాలకు పెట్టుబడి ధనం కావలసిన మాటనిజమే. ఆనకట్టలూ, రైలురోడ్లూ, పాఠశాలలూ, ఆసుపత్రులూ మొదలైనవి కట్టటానికి ధనంకావాలి.

ఈ పెట్టుబడి సమస్యను పరిష్కరించే భారం "అభివృద్ధి పునర్నిర్మాణాల అంతర్జాతీయ బ్యాంకి"కి అప్పగింప బడింది. ఏ దేశమైనా తనకు కావలసిన పెట్టుబడి సమకూర్చుకోలేకపోతే ఆ దేశానికి ఈ బ్యాంకి అప్పుయిస్తుంది. ఇట్లు అప్పులిచ్చేందుకు కావలసిన ధనం ప్రైవేటు పెట్టుబడి దార్లనుండీ, యితర ప్రభుత్వాలనుండీ వసూలు చేయబడింది.

పెట్టుబడి సమకూర్చడం ఎంతో ముఖ్యమైనపనే ఐనా, ఇది సాంకేతిక సహాయ సంస్థయొక్క బాధ్యతగాదు. దాని కర్తవ్యం ధనమివ్వడంగాదు – సమకూర్చిన విజ్ఞానాన్ని బడుగు దేశాల కందివ్వడమే.

ఈ బృహత్ప్రణాళికలోని ప్రథమ సూత్రాలు మాత్రమే యివన్నీ. ఇది మొదలుపెట్టినప్పటినుండీ యెన్నో దేశాలు దీనిలో చేరుతున్నాయి. ఒక దానివెంట మరొకటి యెన్నో దేశాలు తమ శక్తి కొలదీ సాంకేతిక విజ్ఞానాన్ని సమర్పిస్తున్నాయి. అనేక దేశాలు తమ అవసరాలకొద్దీ సహాయాన్ని స్వీకరిస్తున్నాయి. కరిబియన్ దీవులలోనూ, దక్షిణమెరికా కొండలలోనూ అడవులలోనూ ఈ విజ్ఞాన నిధిని గురించిన వార్తలు వ్యాపిస్తున్నాయి. మధ్యప్రాచ్య గ్రామాలలో, భారత దేశపు జనసమ్మర్దమైన నదులోయలలో దీనిని గురించి ప్రజలు వింటున్నారు. దీనిమూలంగా క్రొత్తగా విముక్తి పొందిన ఆసియా దేశాలలో ఆశాజ్యోతి వెలుగుతూవుంది.

"పనులు చేసుకోవటంలో మనకిన్నాళ్లూ తెలియని మంచి పద్ధతులున్నాయి. మలేరియాను అరికట్టవచ్చు. పశురోగాలు నివారించవచ్చు. ఎక్కువ ఆహారం పండించవచ్చు. ఈ పనులకు కావలసిన విజ్ఞానం ఐక్యరాజ్యసమితి వద్దవుంది; మనం వాడుకోవచ్చు" అని ప్రజలు ఒకరితో ఒకరు చెప్పుకుంటున్నారు.

సాంకేతిక సహాయసంస్థ ఉద్యోగులలో ఒకాయన యిలా అన్నాడు: "ఈ పని నిదానంగా జరుగుతున్న మాటనిజమే. ఇరవై యేండ్లవరకూ గొప్ప ఫలితాలు కనపడక పోవచ్చు. ఇరవై యేండ్లే! అనవచ్చు. ఐతే, ప్రపంచ సుఖశాంతులు నిర్మించే టప్పుడు యిరవై యేండ్లంటే యెంత?"

---

# 3. ఎల్ సాల్వడార్ లోయలో ఆశాజ్యోతి.

సాంకేతిక సహాయసంస్థ అధ్వర్యము క్రింద ఐక్యరాజ్య సమితి ప్రారంభించిన అనేక వందల ప్రణాళికలను అన్నిటినీ వివరించడం సాధ్యంగాదు. వానిలో ముఖ్యమైన వానిని గురించి మాత్రమే వ్రాయగలం. మధ్య అమెరికాలోని ఎల్ సాల్వడార్ తో మొదలు పెట్టవచ్చు.

ఎల్ సాల్వడార్‌లో 1950 వేసవిలో ఒక పొలమువద్ద ఒక పదునారేండ్ల బాలిక నిలబడింది. ఆమె ఒక పెద్ద జనప మోపును భుజముమీద పెట్టుకొనిపోయి ఒక బండిలో వేసింది. పర్వత శిఖరములపైనుండి సూర్యుని తీక్షకిరణములు ఆ పొలము మీద పడుచుండెను. ఆమె నల్లని కురులమీదా, నున్నని చెంపలమీదా, చెవులలోని ఇత్తడి కమ్మల మీదాపడి సూర్యకాంతి మెఱయు చుండెను. ఆ నవ యవ్వనవతి చిరునవ్వులో దంతకాంతులు గనుపించు చుండెను. ఆ చిరునవ్వుకు కారణమేమైనా ఉన్నదా?

ఎల్ సాల్వడార్‌లోని ప్రజలందరివలెనే ఆమెకూడా పేదదే. ఆమె కుటుంబమంతా – తల్లి, తండ్రి, తోబుట్టువులు – కలిసి ఆర్జించెడి రోజుకు రెండు రూపాయలే. ఇరుగు పొరుగు కుటుంబా లన్నీ అంతే.

ఇరుగు పొరుగులవలెనే ఆమెకుకూడా చదువురాదు. ఆ దేశంలో నూటికి 90 మంది బడికి వెళ్లరు. అందరిలాగే ఆమె ఆయుస్సు స్వల్పమే. ఆ దేశంలో సగటు ఆయుః ప్రమాణం 26 సంవత్సరాలు (అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 68½ సంవత్సరాలు.) 60 ఏండ్లు దాటినవారు నూటికి నలుగురు మాత్రం ఉంటారు. శరీర కష్టం, అనారోగ్యం, ఆకలి, అజ్ఞానం వీటియొక్క ఫలితం యిది.

మధ్య అమెరికాలోని ఈ ప్రజాస్వామిక దేశం అందమైనది. దేశం అంతా పర్వతమయమై మధ్య ఎత్తైన పీఠభూమితో పదునెకండు పెద్ద అగ్నిపర్వతాలు గలిగియున్నది. దేశము చిన్నది: పొడవు 160 మైళ్ళు, వెడల్పు 60 మైళ్ళు.

కొండలోయల్లో ప్రజలు క్రిక్కిరిసి ఉంటారు. ఎండుపుల్లలమీద గడ్డి లేక అరటి ఆకులతో కప్పబడి మట్టినేలమీద కట్టబడిన ఇండ్లలో వీరి సంసారం. మామూలుగా సంసార మంతయు ఒకే ఒక గదియందు నివసించును. గోడ పగుళ్ళద్వారా తప్ప పొగ పోవుటకుకూడ అవకాశము లేనటువంటి ఇండ్లలో ఒక మూల వర్షాకాలములో చిన్నమంటతో వంట చేసుకుంటారు. ఆరోగ్య సౌకర్యాలు అసలేలేవు. నీటి సదుపాయాలు అంతంత మాత్రమే. ఆ మెరిసే చెవుల కమ్మల యువతి యొక్క అల్పాయుస్సుకు ఇవన్నీ కొంతవరకు కారణాలే. ఈ కారణాలను త్వరలో తొలగిస్తేతప్ప ఆమె ఆయుస్సు పెరగటానికి వీలులేదు.

ఈ చిన్న ప్రజాస్వామిక దేశంలోని ప్రజల ముఖ్యజీవనాధారం వ్యవసాయం. కాఫీ, పంచదారా, జనుమూ ఎక్కువగా పండించి విదేశాలకు ఎగుమతి చేస్తారు. అన్నిటికంటె ముఖ్యమైన పంట మొక్కజొన్న - ఇది తినడానికి సరిపోతుంది. మొక్కజొన్నలూ, చిక్కుడుకాయలూ, బియ్యమూ ఇవి వీరి దిన దిన భోజనము.

పొలాలలో ఎంతో కష్టపడి పనిచేస్తారు. కానీ వ్యవసాయానికి కావలసినన్ని నీళ్ళులేవు. అడవులన్నీ పూర్వమే నరికి వేయడంతో, ఉన్నపంకలూ వాగులూ అదృశ్యమైనాయి. జలాధారాలు అదృశ్యం కావడంతో దారిద్ర్యం, ఆకలి, రోగాలూ బయలు దేరినాయి.

ఈ దేశం జనాభాలో నూటికి 20 మంది పట్టణాల్లో ఉన్నారు. పట్టణాల్లో పరిస్థితులైనా ఏమంత బాగుగాలేవు. చాలా మంది "మెసోను" అనబడే ఇళ్ళలో ఉన్నారు. "మెసోను" అంటే మధ్యన బయలుజాగా, చుట్టూ ఒంటిగదులు. ఒక్కొక్క గదిలో ఒక్కొక్క కుటుంబం ఉంటుంది. బయలుజాగా మధ్యలో ఒక మరుగు దొడ్డి, ఒక పెద్ద నీళ్ళతొట్టి ఉంటాయి.

ఈ మధ్య ఎల్ సాల్వడార్ ప్రభుత్వము ఒక విద్యా విధానాన్ని ప్రవేశ పెట్టుటకు ప్రయత్నించింది. విద్యవల్ల జనసామాన్యం బాగుపడుతుందని ప్రభుత్వం ఊహించింది. కాని ఎల్ సాల్వడార్‌లో తల్లిదండ్రులు తమ పిల్లలను బడికి పంపలేదు. పంపితే

తమ వ్యవసాయపు పని కుంటుబడుతుంది. ఒకవేళ పిల్లలందరూ బడికి పోగల్గినా ఈ కార్యక్రమము నెరవేరేదిగాదు. ఎందుకంటే పిల్లలందరికీ ప్రాథమిక విద్య చెప్పటానికైనా తగినంతమంది ఉపాధ్యాయులు లేరుగనుక.

ఎల్ సాల్వడార్‌లో చేయవలసిన పనులు అర్థమౌతూనే ఉన్నవి. ప్రజలకు మంచి వ్యవసాయ పద్ధతులు నేర్పిస్తే, తినడానికీ, ఎగుమతి చేయడానికీ ఎక్కువ పంటలు పండిస్తారు. కొత్తగా చెట్లునాటి అడవులు పెంచవలె. ఉన్న జలాధారాలను కాపాడుకొంటూ సద్వినియోగం చేసుకోవలె. నీటిలో మురికి లేకుండా చేయవలె. ఆరోగ్యకరమైన పద్ధతులు నేర్పితే ప్రజలు నేర్చుకుంటారు. శిశు పోషణలో ఎక్కువశ్రద్ధ తీసుకొనేటట్లు తల్లులకు నేర్పితే నేర్చుకుంటారు. ప్రజల్లో దారిద్ర్యం కొంత తొలగిస్తే పిల్లలు బడికి పోవడానికి అవకాశ ముంటుంది.

ఎల్ సాల్వడార్‌లో జనాభా ఎక్కువగా ఉండటమేగాదు; సంవత్సరానికి నూటికి ఇద్దరి వంతున జనాభా పెరుగుతూనే ఉంది. అమెరికా ఖండంలో అతిజనాకీర్ణమైన దేశం ఇదేనని అంటారు. ఇతరులనుండి కొంతసహాయమూ, సలహా లభిస్తే ఈ దేశ ప్రజల ఆరోగ్యమూ, ఉత్పాదకశక్తి పెరుగ గలవు. వీరి ఉపయోగార్థము ఏమి చేయవలసిందీ అందరికీ తెలుసు; చేయడమే తరువాయి.

ఎక్కడనుండి మొదలు పెట్టవలెననేది నిజానికి పెద్దప్రశ్నే. చిక్కుపడిన దారపు చెండువలె నుండినాయి దేశంలో సమస్యలు.

చిక్కులు విడదీయడానికి డజను రంగాలలో నిపుణులు కావాలి. అట్టి నిపుణులు లభ్యమైనా దేశంలో అన్నిచోట్లా ఒకేసారి పని చేయలేరు. ఆహార వ్యవసాయ నిపుణులు, గృహనిర్మాణ నిపుణులు, ఆరోగ్యశాస్త్ర నిపుణులు, ఉపాధ్యాయులు, డాక్టర్లు, ఇంజనీర్లు అందరూ కావాలి.

**1947** లోనే ఎల్ సాల్వడార్ ఐక్యరాజ్యసమితి సహాయాన్ని అర్థించింది. ఆ సంవత్సరం ఈ దేశానికి ఒక సాంఘిక భీమా పథకం గురించి సలహా నివ్వటానికి ఒక సంఘాన్ని అంతర్జాతీయ కార్మికసంస్థ పంపింది. అంతర్జాతీయ బ్యాంకికూడా ఒక సంఘాన్ని పంపి ఒక జలవిద్యుత్ ప్రణాళికా నిర్మాణానికి కొంత ధనము అప్పుగా యిస్తామని చెప్పింది. తరువాత ఐక్యరాజ్యాల అంతర్జాతీయ అత్యవసర శిశు సహాయకనిధి ఈ దేశంలో మాతా శిశువుల ఆరోగ్యాభివృద్ధికి పాటుపడే టందుకు కొంత మందిని పంపింది. ఆహార వ్యవసాయసంస్థ పెద్ద టీకాల ఉద్యమాన్ని నడిపింది.

ఇవన్నీ ఎంత ఉపయోగకరంగానూ, ఆశాజనకంగాను ఉన్నా, అసలు సమస్యమాత్రం అట్లే ఉండిపోయింది. ప్రజలందరికీ కావలసిన తిండి భూమిలో పండటంలేదు. పొలాల్లోనూ, పట్టణాల్లోనూ పనిచేసేవారిని వ్యాధులు పీడిస్తూనే యున్నవి. శిశు మరణాలసంఖ్య భయంకరంగానే ఉంది.

**1950**లో ఎల్ సాల్వడార్ ప్రభుత్వము తన సమస్యలను సాంకేతిక సహాయసంస్థ ఎదుట పెట్టింది.

ఆ ప్రభుత్వము తమ సమస్యలను ఈ విధంగా పేసపుప్రెట్టింది. "ఏమిటి మా కర్తవ్యం? మేము మొట్ట మొదట చేయవలసిన పనియేమి? విద్యాబోధన ప్రారంభిస్తుమా? విద్యకు ఎగ్గి లక్షల రూపాయలు ఖర్చుపెట్టినా పిల్లల ఆహారలోపమూ అనారోగ్యమూ తీరవే? నీటి పారుదల ప్రణాళిక మొదలు పెట్టుదుమా? దీనికి ఎంత ఖర్చుపెట్టినా ప్రజలలో వ్యవసాయ శాస్త్రజ్ఞానము లేనిది నిరుపయోగము గదా? ఆహార శాస్త్రమూ, ఆరోగ్య శాస్త్రమూ ప్రచారము చేస్తుమా? ఈ విషయాలలో ప్రజలు కొత్తపద్ధతులు సులభంగా అవలంబించరుగదా? ఎన్నడూలేని ఆరోగ్య పద్ధతులను ఈ నాడు గుర్తించరు. తర తరాలగా తింటూవున్న చిక్కుడు గింజలు, మొక్కజొన్నలు మానుకొని పండ్లు, కూరగాయలు, గ్రుడ్లు, చేపలు మొదలైన బలవర్ధక వస్తువుల విలువను వెంటనే ఎట్లు గుర్తిస్తారు?

"సంతాన నిరోధక పద్ధతులవలంబిస్తే జనాభా తగ్గుతుంది· అప్పుడు దేశం బాగుపడుతుంది. అని కొందరంటారు. మా దేశంలో ఇది చాల కష్టమైన పని. ఈ విధంగా అన్నీ చిక్కులే" ఇవీ వారి సమస్యలు.

అదే సంవత్సరమే, అనగా 1950 లోనే, సమస్యలను పరిశీలించడానికీ; ప్రభుత్వ ఉద్యోగులతో చర్చించడానికి కొంతమంది నిపుణులను సాంకేతిక సహాయసంస్థ ఎల్ సాల్వాడార్‌కు పంపింది. త్వరలోనే ఒక పథకము తయారైంది.

ఆ నిపుణులు "దేశమంతటినీ మేము ఒకేసారి మార్చ లేము. ఒక చిన్న ప్రదేశాన్ని తీసుకొని అక్కడి పరిస్థితులను అత్యుత్తమ స్థితిలో పెట్టుటకు ప్రయత్నిస్తాము. ఆ ప్రదేశాన్ని చూచిన వారంతా అనుకరిస్తారు. దాని ప్రభావము క్రమ క్రమంగా దేశమంతా వ్యాపిస్తుంది. ఈ పథకం ఇక్కడ నెరవేరితే ఇటువంటివి ప్రపంచంలో ఇంకా అనేకచోట్ల ప్రవేశ పెట్టవచ్చు" అని అన్నారు.

ఆ విధంగా "కుస్కట్లన్‌లోయ ప్రదర్శన పథకం" ప్రారంభమైంది.

ఈ లోయ ఎల్ సాల్వడార్‌కు దాదాపు కేంద్రంలో, సాన్ సాల్వడార్ నగరానికి ఉత్తరంగా ఉంది. ఇది సుమారు 500 చదరపు మైళ్ళ వైశాల్యము గలిగి 160,000 జనాభాగలది. ఈ ప్రదేశంలో కొండలూ, సారవంతమైన భూములూ, కొన్ని పట్టణాలూ ఉన్నవి. ఫ్యాక్టరీలు బొత్తిగాలేవు. చేనేత మాత్రం గుడిసెలలో విధివిగానె సాగుతూ ఉంటుంది. ఆ జిల్లా కంతటికి ఒకే ఒక డాక్టరు ఉన్నాడు.

స్థల నిర్ణయమైన తరువాత సాంకేతిక సహాయసంస్థ, ఎల్ సాల్వడార్ ప్రభుత్వమూ కలిసి, ఐక్యరాజ్యసమితి దేశాల నిపుణులను ఎన్నుకోవడం ప్రారంభించినారు. ఒక మెక్సికో దేశస్థుని ప్రజారోగ్య సలహా దారునిగనూ, ఒక కొలంబియా దేశస్థుని శానిటరీ ఇంజనీరుగానూ, అమెరికా నుండి ఒక ప్రజారోగ్య నర్సునూ

ఎన్నుకొన్నారు. ఇంకా అనేకమంది నిపుణులూ, సహాయకులూ – సాంకేతిక సహాయసంస్థ నిధియొక్క ధన సహాయంతో - కూర్చుకో బడినారు.

ఈ పథకంలో ఆరోగ్య సమస్యను ముఖ్యసమస్యగా ఎన్ను కున్నారు. ప్రజలలో అధిక సంఖ్యాకులను బాధించే మలేరియా మీద మొదట దాడి ప్రారంభించినారు. ఇల్లిల్లూ తిరిగి డీ. డీ. టీ. (D. D. T.) అను మందును పంపులతో చల్లినారు. 105,000 మంది నివసించే 17,500 ఇండ్లలోనూ, దోమలు పెరిగే నీటి కాలు వలూ, గుంటలూ మొదలైన వాటిలోనూ మందు చల్లిన తరువాత పరీక్షచేయగా మలేరియా ఎక్కడా కనపడలేదు. తరువాత క్షయ మొదలైన అంటు వ్యాధులను గురించి శ్రద్ధతీసుకొన్నారు. ఇదంతా మూడు మాసాలు మాత్రమే పట్టింది. ఈ లోగా నర్సులకూ, శాని టరీ ఇన్స్పెక్టర్లకూ ట్రెయినింగ్ ఇచ్చేకోర్సులు ప్రారంభించి "గాటిమాలా"లో జాతీయ ఆహార పరిశోధనలో పాల్గొనేందుకు ముగ్గురు వ్యక్తులకు ఉచిత వేతనాలు ఇచ్చినారు.

ఒక వైపున ఈ పనులు జరుగు తుండగా, మరొక వైపున ఇతర నిపుణులు ఇతర పనులు చేస్తూవుండిరి. కొందరు జట్లు జట్లుగా వెళ్ళి రైతులకు భూసార రక్షణ పద్ధతులనూ, మురుగు నీటి పారుదల పద్ధతులనూ నేర్పుచుండిరి. మరి కొందరు ప్రభు త్వముతో కలిసి చేతి పరిశ్రమలలోని కార్మికులకు గృహవసతులు మొదలైన జీవన పరిస్థితులను అభివృద్ధి చేయుటకు ప్రయత్నించు

చుండిరి. ఈ లోయలోనూ తర్వాత దేశంలో మిగతచోట్లా, విద్య, ఆరోగ్యము బోధించగల ఉపాధ్యాయులను తర్ఫీదు చేయుటలో మరికొందరు నిపుణులు నిమగ్నులైరి.

"కుస్కొట్లన్" ఒక చిన్న దేశంలోని చిన్న భూభాగమే కావచ్చు. మహత్కార్యాలలో నిమగ్నమైన ప్రపంచం దీనిని గమనించకపోవచ్చు. ఐనా "కుస్కొట్లన్"లోనూ స్త్రీలు, పురుషులు, శిశువులు ఉన్నారు. వాళ్లూ జీవితంలో సుఖపడ గోరుతారు. సుఖాల కొరకు కృషి చేయడానికి సిద్ధంగా వున్నారు. దారిద్ర్యం, అజ్ఞానం, అనారోగ్యం ఈ మూడు భూతాలు వారిని జీవితమంతా వెన్నాడుతూనే వచ్చినవి. ఇప్పుడు వారి ప్రభుత్వం ఐక్యరాజ్య సమితితో కలిసి పనిచేస్తూ యున్నది. గనుక వారు సుఖాల కొరకు ఎదురు చూడవచ్చు. మెరిసే ఇత్తడి కమ్మలతో, భుజాలమీద జనప కట్టమోసే జవ్వని ఆత్మ విశ్వాసంతో చిరునవ్వు నవ్వవచ్చు. "విధి" వ్రాసిన ఇరవై యూరేండ్లుదాటి ఇంకా ఎన్నో యేండ్లు బ్రతకడానికి ఆమెకు అవకాశం ఉంది.

---

# 4. హైటీ దీవికి మరికొన్ని చేపలు.

హైటీదీవి కరిబియన్ సముద్రంలో వుంది. ద్వీపమంతా పర్వతమయం. పర్వత సానువులు మామిడి చెట్లతో, బ్రెడ్‌ఫ్రూట్ వృక్షాలతో మనోహరంగా వుంటాయి. సముద్రతీరంచుట్టూ ప్రవాళ పర్వతాలతో ఆడుకొనే సముద్రతరంగాలూ, మందమారుతంలో ఎర్రమల్లె, బోగన్‌విల్లాల పరిమళాలూ – ఇవి ఈ దీవి లక్షణాలు.

ఈ దీవి చరిత్రగూడా రసభరితమైందే. "కొలంబస్" తన రెండవ సముద్రయాత్రలో దీని మీపదిగి దీనిని "స్పెయిన్" దేశము తరఫున ఆక్రమించు కొన్నాడు. ఈ దీవిలోని ఎగుడు దిగుడు పర్వత సానువుల్లో బంగారుగాని, రత్నాలుగానీ, లేవని తెలినంతనే ఇక్కడి రెడ్ ఇండియన్ ప్రజలను బానిసలుగా చేయడానికి ప్రయత్నించినాడు. కాని రెడ్ ఇండియనులు రోగ పీడితులై మరణింప సాగినారు. స్పెయిన్ దేశీయుల దృష్టిగూడ మెక్సికో, పెరూ, దేశాలలోని సంపద వైపుకు మళ్ళింది.

క్రమ క్రమంగా హైటీ నిర్జనమైంది. అందువలన అది సముద్ర చోరులకు - ముఖ్యంగా ఫ్రెంచి సముద్ర చోరులకు స్థావర మైంది. 18 వ శతాబ్ద ప్రారంభంలో అక్కడ ఫ్రెంచి దొంగ లెక్కువగా నున్నందుననే ఫ్రెంచి రాజు దానిని తన వలస రాజ్యంగా చెప్పుకున్నాడు.

ఈ దీవికి ఆఫ్రికానుండి నీగ్రోలను తెచ్చింది ఫ్రెంచివారే. నౌక వెంబడి నౌక నీగ్రోలను తీసుకరావడంతో త్వరలోనే ఫ్రెంచి వారి సంఖ్యకంటే నీగ్రోలసంఖ్య యెన్నోరెట్లు యెక్కువైంది. ఈ నీగ్రోలు "టౌస్సెంట్ లా ఓవర్టూర్" అను భావవాది నాయకత్వం క్రింద తిరుగుబాటు జేసినారు. అతడు ఎరుపు, బంగారు చారలుగల తెల్లని దుస్తులు ధరించి ఒక తెల్లని గుర్రమునెక్కి తిరుగు చుండే వాడు. అతడు మోసముచేత పట్టుబడిన తరువాత డెస్సాలిన్స్ అను నీగ్రో నాయకుడాయెను. అతడుగూడ మోసముచేతనే పట్టు బడి తుదకు ఆత్మహత్య చేసికొన్నాడు. అతని ప్రాణము తీసిన తుపాకిగుండు బంగారుతో చేయుబడి యుండెనని ప్రజలు చెప్పు కొందురు. తరువాత "హెన్రీక్రిస్టఫి" నాయకుడై 3000 అడుగుల యెత్తున్న ఒక పర్వత శిఖరముమీద ఒక కోట కట్టినాడు. కాని యింతలో ఫ్రెంచివారీ దీవిని విడిచి పెట్టుటచే ఈ కోటతో అవస రము లేకపోయింది.

అప్పుడు హైటీ ఒక నీగ్రో ప్రజాతంత్ర దేశమైంది. కరిబి యన్ సముద్రంలో ఇది ఏకైక సంపూర్ణ నీగ్రో ప్రజాతంత్ర దేశం. అప్పటినుండి ప్రజలు తమ భూముల్లో వ్యవసాయం చేసుకోన డంలో నిమగ్నులైనారు.

అనేక సంవత్సరాల విప్లవ చర్యలతో వీరు అలసినారేమో, లేక బలవంతులందరూ చచ్చి బలహీనులు మాత్రమే మిగిలి నారేమో. విప్లవాలలో మునిగిన యితర దేశాల ప్రజలు విప్లవానం

తరం బాగానే వున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలను చూస్తు న్నాముగదా. కాని ఈ దీవి ప్రజలు మాత్రం కృశించి పోతున్నారు.

ఈ ద్వీపవాసులకు శక్తీ, ఉత్సాహమూ లేకపోవుటకు కారణం వీరు మొన్నటివరకూ బానిసలుగా ఉండటంగాదనీ, విప్లవచర్యల్లో అలసి పోవటంగూడాకాదనీ అయితే దీనికి కారణం వీరుతినే ఆహారం శక్తి హీనమైంది కావటమేననీ మనుష్య శాస్త్ర జ్ఞులు చెప్పుచున్నారు.

సరియైన ఆహారంలో పిండి పదార్థములు, కూరగాయలు మొదలైన వాటివలెనే మాంసకృత్తులుగూడా వుండవలెను. బలా నికీ, పెరుగుదలకూ, మాంసమూ, గుడ్లూ, చేపలూ, వెన్నా అవస రమని డాక్టర్లు అంటారు. కానీ ప్రపంచ జనాభాలో సగంమంది ఆహారంలో ఈ మాంస కృత్తులు తక్కువగా వున్నాయి. హైటి దీవిలో పశువులు పెంచటానికి వీలులేదు. మాంసమూ, పాలు దొరకడం చాలకష్టము. కోళ్ళు చాలఅరుదు. చేపలుగూడ చాల తక్కువే. ఈ ద్వీపవాసులు చేపల ఉత్పత్తి ఎక్కువ చేయుగలిగితే మాంస కృత్తులు ఎక్కువగా లభిస్తాయి.

వీరు ఐక్యరాజ్యసమితి యెదుట బెట్టిన సమస్య ఇదే. వారి ఆహారానికి మాంస కృత్తులను కూర్చగల మత్స్య సంపదను అభి వృద్ధి చేయడం యెట్లు? పెద్ద పెద్ద పారిశ్రామిక దేశాల నిపుణు లకు ఈ సమస్యను గురించి బాగా తెలియదు. వారికి మాంసమూ,

గ్రుడ్లూ, పాలూ సమృద్ధిగా వున్నాయి. ప్రత్యేక నౌకాదళాలు సుదూర సముద్రాలకుపోయి చేపలుపట్టి ప్రజలకు అందిస్తున్నాయి.

ఇతర దేశాల ప్రజలు అనేక శతాబ్దాలుగా చేపలు పట్టుతూనే వున్నారు. వారి విజ్ఞానాన్ని హైటీ ప్రజలు వినియోగించుకోవచ్చు.

ఐదు వందల సంవత్సరాలనుండి జావా ప్రజలు చేపలు "పండిస్తు"న్నారు. అనగా వారు వరి నాటేటప్పుడు వరిమళ్ళలో చేప పిల్లలను వదలుతారు. వరి కోతకు వచ్చేటప్పటికి చేపలు గూడ తినడానికి తగినంత పెరిగి పెద్దవై యుంటాయి.

జావాలో మొదట బానిసలు ఈ విధంగా చేపలను 'పండిస్తూ' వుండిరి. హైటీలో వలెనే ఇక్కడగూడా కొండ లెక్కువగా వున్నాయి. కొండపదుల వెంబడి మట్టితో కట్టలు కట్టి చదునైన పొలాలుగా తయారు చేసినారు. ఈ పొలాలు నీటితో నిండినపుడు వరి నాటి అందులో చేప పిల్లలను విడుస్తారు. ఈ పిల్లలను ప్రత్యేకమైన చెరువులనుండి తెస్తారు. మూడు మాసాలలో వరి కోతకు వచ్చేటప్పటికి జావా దేశస్థులకు మంచి ఆహారము తయారవుతుంది.

జావాలో కొన్ని సమయాల్లో మామూలు చెరువులలోగూడ ఈ చేప పిల్లలను విడుస్తారు. వరికోసే టప్పటికి చెరువులు ఖాళీ అవుతాయి గాబట్టి చెరువు మధ్యన ఒక గుంత త్రవ్వుతారు. చేప పిల్లలు ఈ గుంతలలోచేరి బాగా పెరిగి పెద్దవైతాయి.

ఈ విధంగా జావాలో మంచినీటి చేపలేగాక ఉప్పునీటి చేపలుగూడ పెంచుతారు. సముద్రతీరంలో పల్లపునేలలో గోడకట్టి పోటు వచ్చినపుడు సముద్రపు నీటిని నిల్వచేసి అందులో ఉప్పు నీటి చేపలను పెంచుతారు. ఈ పల్లపు నేలలలో చేపలను పెంచడవల్ల మరొక లాభంకూడ ఉంది. ఇక్కడ దోమలు పెట్టిన గ్రుడ్లు చేపలు తినడంతో మలేరియా వ్యాపించకుండా ఉంది.

హైటీ ద్వీపవాసులు ఐక్యరాజ్యసమితి ప్రవీణుల సహాయము అర్థించిన వెంటనే, చేపల పెంపకం నేర్చుకోటానికి హైటీ నుండి జావాకు ఒక విద్యార్థిని పంపినారు. అతడు హైటీకి తిరిగి వచ్చిన పిమ్మట అతనికి కావలసిన సహాయకులను తర్ఫీదు చేసినాడు. నీరు నిలిచే ప్రదేశాలలోనూ, పంట కాల్వలలోనూ, సముద్రతీరంలో తేమ నేలలలోనూ చేపల పెంపకం ప్రారంభమైంది. 1952లో మరియిద్దరు నిపుణులు అమెరికానుండి, జమైకానుండి వచ్చి "ముల్లెట్" "తైలాపియా" అను చేపలను హైటీలో ప్రవేశపెట్టినారు. వీరి ప్రయత్నం వెంటనే ఫలించి పెంపకపు చెరువులు చేపపిల్లలతో కళ కళ లాడినాయి. ఈ పిల్లలను కాల్వలలోనూ చెరువులలోనూ విడిచినచో త్వరలో పెద్దవౌతాయి.

ఈ వార్త హైటీ రైతులలో త్వరగా వ్యాపించింది. వారువచ్చి, చేపల పెంపకం గురించి తెలుసుకొని చేపపిల్లలను తీసుకపోయి పెంచ సాగినారు.

హైటీ ద్వీపమంతా ఈ విషయము తెలిసెను. "ఈ పని ఈ విధంగా చేయడం ఏమీ కష్టంగాదే" అని దేశమంతా అనుకొన్నారు.

ఈ నాడు పంచలకొలది రైతుల ఇళ్ళలో చేపలు ఉడుకుచున్నాయి. సాయంత్రమయ్యే టప్పటికి చేపల వాసన గాలిలో వ్యాపిస్తూ వుంటుంది.

అంటే అర్థమేమి? ఐక్యరాజ్యాల విజ్ఞాన నిధి హైటీకి ఏమి యిచ్చింది? ఆహార సంపాదనకు ఒక సులభమార్గము యిచ్చింది. ఆఫ్రికానుండి బానిసలుగా వచ్చిన హైటి నీగ్రోలకు తొలిసారిగా కావలసినంత ఆహారము – అవసరమైన మాంసకృత్తులతో లభిస్తూవుంది. హైటీలోని ఈ పరిణామాన్ని కరిబియన్ సముద్రములోని ఇతర జాతులవారు చూచి నేర్చుకొనగలరు. ప్రపంచములో ఆకలిగొన్న అనేకులు అనుసరింప గలరు. ఆకాలం వచ్చినప్పుడు విజ్ఞాన నిధిని మొదట వినియోగించు కొన్నవారు హైటీ ప్రజతో అన్నవిషయం అందరికీ గుర్తుండవచ్చు.

---

# 5. "సింహాసన మెక్కిగూడా బిచ్చగాడే"

1949 సెప్టంబర్‌లో ఐక్యరాజ్యసమితిలోని బొలీవియా దేశపు శాశ్వత ప్రతినిధి డాక్టర్ ఎడ్వర్డో అంజియో మాటింజో **(Eduardo Anzio Matienzo)** సాంకేతిక సహాయసంస్థ సహాయాన్ని అర్థించినాడు.

"ఒక సాంఘిక ఆర్థిక అభివృద్ధి ప్రణాళికను అమలు జరపడంలో మా ప్రభుత్వానికి మీరు తోడ్పడుతారా?" అని ఆయన ప్రార్థించినాడు.

అప్పుడు సాంకేతిక సహాయసంస్థ ఒక పరిశీలక సంఘాన్ని బొలీవియాకు పంపింది. ఆ సంఘంలోని 22 మంది సభ్యులూ భూమధ్య రేఖదాటి ఆండీస్ పర్వతాలు అధిరోహించి బొలీవియా చేరుకొన్నారు. వారికి కనుపించినవి అగణితమైన ప్రకృతి సంపదా అనూహ్యమైన దారిద్ర్యమూ. "సింహసన మెక్కిగూడా బిచ్చగాడైన వానివలె ఉంది మా దేశం" అని ఒక బొలీవియా అధికారి వారితో అన్నాడు.

ఆ దేశంలో అన్నిరకాల ప్రదేశాలూ ఉన్నవి. ఓరియంటి లాటి నిమ్నతలాలూ ఉన్నవి. అనంతమైన ఆల్టిప్లేనో **(Altiplano)** పీఠభూమీ ఉంది. ఆండీస్ **(Andes)** పర్వతశ్రేణి సంతతనీ ఆప

రించుకొని వుంది ఆ పీఠభూమి. ప్రజలలో కొందరు చిన్న చిన్న వ్యవసాయదారులు. తక్కినవారంతా తగరపు గనులలో పనిజేసే కార్మికులు. వారిలో నూటికి తొంభైమందికి చాలినంత తిండిలేదు. కాని పండుగలకూ, శ్రాద్ధాలకూ, విపరీతంగా ఖర్చు పెట్టుతారు. కొకా అనే సారాయి కొనడానికి డబ్బు వుంటుంది. తాము చేసేపని కూడా నిలిపి అప్పు డప్పుడూ కోకా త్రాగు తుంటారు.

పరిశీలక సంఘంరాకను ప్రజలు గమనించలేదు. గొర్రె లనూ, పశువులనూ కాచుకొనడంలోనూ, కోకో, వరి, కాఫీ పండించ డంలోనూ, గనులనుండి తగరం తీయడంలోనూ వారు నిమగ్నులై యుండినారు. ఈ పనులన్నీ తర తరాలుగా వారి తండ్రులూ, తాతలూ చేసినవే. వారానికి ఏడు రోజులూ పనే. రాత్రిపూట గుడిసెలకు పోతారు. గుడిసెలు చిన్నవైనా కుటుంబాలు పెద్దవి. పుష్టినిచ్చే ఆహారం లేనందువలన స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ కృశుకాయు లౌతున్నారు.

ఐనా "ఇన్కా"ల **(Incas)** వారసులే వీరు. వీరి పూర్వపు రాజులు సువర్ణ మయమైన సభలో కొలువు దీరినారు. సూర్య పుత్రులమని చెప్పకొన్నారు. ఆ దేశంలో వున్నంత వెండి దక్షిణ అమెరికాలో యెక్కడాలేదు. పాటోసి దగ్గరకొండలో ద్రవరూపంలో వెండి ప్రవహిస్తూ వుంటుంది.

ఆ దేశంలోని ఐశ్వర్యమే స్పెయిన్ దేశస్థులను ఆకర్షించింది. దేశాన్ని ఆక్రమించిన స్పెయిన్‌వారు అక్కడి మనోహరమైన

వెండి బంగారు ఆభరణాలను కరిగించి కడ్డీలుగా స్పెయిన్‌కు పంపినారు. దేశీయులైన రెడ్ ఇండియనులు పెక్కుమంది చంపబడినా ఇంకా కొంచమున్నారు. స్పెయిన్ దేశస్థులూ కొందరు నిలిచి పోయినారు. కాలక్రమేణా ఉభయుల సంస్కృతులూ కలిసి పోయినాయి. వేదనా భరితమైన దేశీయ సంగీతమూ, స్పెయిన్ దేశపు దుస్తులూ కలిసి పోయినాయి. ఉభయుల భాషలూ కలిసి క్రొత్త భాష బయలు దేరింది. ఉభయులలోనూ ఇతరులతో కలియకుండా మడి గట్టుకున్న వాళ్ళుకూడా లేకపోలేదు.

1820 తరువాతి సంవత్సరాలలో "స్వేచ్ఛాప్రదాత" అను బిరుదుగల బొలీవర్ దేశమంతా తిరిగి స్పెయిన్‌రాజు అధికారము నుండి ప్రజలకు విముక్తి కలిగిస్తానని ప్రచారము చేసినాడు. రెడ్ ఇండియనులు, స్పెయిన్ దేశస్థులు, మెస్టిజోలు (సంకరులు) దేశక్షేమముకొరకు ఇతని ననుసరించి పోరాడినారు.

విప్లవము జయప్రదమైన తరువాతగూడా పరిస్థితులలో మార్పేమీ జరుగలేదు. జీవితము యథాప్రకారముగానే సాగిపోతూ వుంది. క్రొత్త ప్రభుత్వము ఏర్పడింది. రాజుకు బదులు ఎన్నికైన ప్రెసిడెంటు ఏలుతున్నాడు. అయితే చదువు సంధ్యలు లేనివారికి ఓట్లు వేయడం అనేది అర్థం లేనిపని.

అక్షరాస్యులుగాని ప్రజలలో ప్రజాస్వామికము పని చేయలేదు. అందుకే బొలీవియాలో ప్రభుత్వాలకు నిలకడలేదు. 1949 నాటికి 125 సంవత్సరాలైంది దేశానికి స్వరాజ్యమువచ్చి. 125

యేండ్లలో 60 మంది ప్రెసిడెంట్లు మారినారు. గడచిన 25 యేండ్లలో యే ప్రెసిడెంటుగాని తన గడువుకాలం పూర్తిగా రాజ్యము చేయలేదు.

నిత్యమూ అధికారులు మారడం, నిత్యమూ శాసనాలు మారడం, నిత్యమూ క్రొత్త పన్నులూ, నిత్యదారిద్ర్యమూ – వీటికి ప్రజలు అలవాటు పడిపోయినారు.

అయినా "బొలీవియా సంపన్న దేశం కావచ్చు" అని ఐక్యరాజ్యాల పరిశీలక సంఘం నివేదిక సమర్పించింది. అనేక తరాల వరకూ ప్రజలను పోషించగల ప్రకృతి సంపద దేశంలో ఉంది. తిండీ, బట్టా, నీడా, శక్తి అన్నీ ఉన్నవి. పండ్లు, పంచదారా, తేయాకూ, కోకో, బియ్యమూ, పండించవచ్చు. కొన్నిచోట్ల నారలూ, ప్రత్తీ, రబ్బరూ పండవచ్చు. గోధుమా, బార్లీ పండించవచ్చు. గొర్రెలూ, ఆవులు, బర్రె, లామా, ఆల్పకా, వికూనా మొదలైన పశువుల పెంపకానికి తగినంత వీలున్నది. అడవులలో రెండువేల వృక్షజాతు లున్నవి. అమూల్యమైన కలప లభిస్తుంది. ఖనిజాలు దేశంలోని ముఖ్యమైన సంపద. తగరమూ, తుత్తునాగమూ, సీసమూ, ఆంటిమొని, టంగ్‌స్టన్, రాగీ, ఇనుమూ, విస్తారంగా ఉన్నవి. మేలురకం బొగ్గు లేకపోయినా ఎర్రబొగ్గు లభిస్తుంది. నూనెగనులుగూడా కనపడినాయి. ఇవన్నిగాక ఆండీస్ పర్వతాలనుండి ప్రవహించే నదులద్వారా విద్యుచ్ఛక్తి యెంతైనా పొందవచ్చు.

బొలీవియాలో వ్యవసాయ వస్తువులూ, కలపా, ఖనిజాలూ ఉన్నవి. ఒళ్ళువంచి నేర్పుతో, తెలివి తేటలతో కష్టపడి పనిచేసే ప్రజలూ వున్నారు. అయినా దేశం దరిద్రంగా ఉంది. నిజంగా సింహాసన మెక్కిన బిచ్చగాడే ఆ దేశం. ప్రకృతి సంపదలు ఏ మాత్రమూ వినియోగింప బడలేదు.

గనులు త్రవ్వడానికీ, కలప మిల్లులు కట్టడానికీ, ఖనిజాలనూ కలపనూ రవాణాచేసే రోడ్లు రైల్వేలు వేయడానికి డబ్బు కావాలి. పంటకాల్వలు త్రవ్వడానికీ, జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేసుకోడానికీ, ఎంతో పెట్టుబడికావాలి. ఈ శక్తి బొలీవియాకు లేదు. ఇదీ పరిశీలక సంఘం నివేదిక యొక్క సారాంశం.

ప్రజోపయోగార్థం డబ్బు కావలసినప్పుడు, ఏ దేశానికైనా రెండు మార్గాలున్నవి. ప్రజలమీద పన్నులు వేయడం ఒకటి, విదేశాలలో అప్పు చేయడం రెండవది. బొలీవియా ఈ రెండు పద్ధతులనూ అవలంబించి చూచింది. ప్రజలమీద పన్నులు వేసింది. కాని ప్రజలందరూ దరిద్రులు కావడంవలన పన్నుల్లో అధిక భాగం వసూలు కాలేదు. మూడు రోజుల కొక ప్రభుత్వం మారే దేశంలో పెట్టుబడి పెట్టడానికి విదేశాలు వెనుకాడినవి.

కాబట్టి బొలీవియాలో రోడ్ల నిర్మాణం సగంలో నిల్చిపోయింది. రిపేర్లు లేనందున రైల్వేలు పనికి రాకుండా పోయినవి. ఖనిజాలు భూమిలోనే ఉన్నవి. కలప అడవుల్లోనే వుంది. ఇదంతా

ఒక విషవద్తులంగా తయారైంది – దేశ దారిద్ర్యానికి కారణం ప్రకృతి సంపదలు వినియోగంలోనికి రాకపోవడం; ప్రకృతి సంపదలు వినియోగంలోనికి రాక పోవడానికి కారణం దేశ దారిద్ర్యమూ, సుస్థిర ప్రభుత్వాన్ని ఎన్నుకోలేని ప్రజల విద్యావిహీనత.

**1950** లో పరిశీలక సంఘం నివేదిక సమర్పించిన నాటి పరిస్థితి ఇది. "వివిధ దేశాలనుండి అనుభవమూ, పరిపాలనా దక్షతా, నిస్సందేహమైన నిజాయితీగల వారి సేవలను పొందుటలో బొలీవియాకు తగు సహాయాన్ని ఐక్యరాజ్య సమితి అందివ్వవలెను" అని ఆ నివేదిక.

ఈ పరిపాలనా నిపుణులు ఐక్యరాజ్య సమితితో జీతాలు తీసికొని బొలీవియా వాసులకు ప్రభుత్వ నిర్వహణలో ట్రెయినింగు ఇవ్వడంలో సహాయం చేస్తారు. ఒక దేశం నుండి గాక వివిధ దేశాల నుండి వీరు వస్తారు గనుక ఏదేశంయొక్క ప్రభావానికి బొలీవియా లోబడదు. ప్రభుత్వోద్యోగులు శిక్షణ పొందిన వారూ, సమర్థులూ ఐతే ఒక బడ్జెట్ తయారు చేయవచ్చు. సరియైన పన్నుల విధానాన్ని అమలులో పెట్టవచ్చు. అనవసరమైన ఉద్యోగులను తీసివేయవచ్చు, క్రమబద్ధమైన ప్రభుత్వాన్ని నెలకొల్పవచ్చు.

ఈ విధంగా ప్రభుత్వ యంత్రాంగాన్ని పునర్నిర్మాణం చేసిన తరువాత బొలీవియా ఒక గొప్ప ఆర్థిక ప్రణాళికను తయారు చేయుడం కష్టమైన పనిగాదు. అయితే ప్రభుతంత్రాంగమ్ము ం

పునర్నిర్మాణం అయ్యేవరకూ బొలీవియాకు ధనమేమీ లభించదు. అన్నవిషయాన్ని ఐక్యరాజ్య సమితి గుర్తించు కొన్నది. అయినా ప్రభుత్వం వెంటనే చేయదగిన పనులు కూడా చాలా ఉన్నవి. ఎక్కువ ఆహార పంటలను పండించే ఉద్యమాన్ని రైతులు ప్రారంభించవచ్చు, ఆ పనిచేస్తే విదేశ ఆహారాల దిగుమతి తగ్గి పోతుంది. ఆహారశాస్త్ర విషయాలనూ, ఏ ఆహారంలో ఎంత పుష్టి ఎంతబలమూ ఉన్నదీ ప్రజలకు వెంటనే నేర్పవచ్చు.

గనులలో పారిశ్రామిక పద్ధతులను గురించి బొలీవియా ప్రభుత్వం ఐక్యరాజ్య సమితిని సలహా లడుగవచ్చు. ఎందు కంటే కొన్ని యంత్ర పరికరాలు ఉండికూడ తగినంత ఉత్పత్తి కావడంలేదు.

రోడ్లు, రైల్వేలకు సంబంధించి ఒక మంచి ప్రణాళికను వేసుకొని, అనవసరమైన వాటిని తీసివేసి ముఖ్యమైన వాటిని పరి పూర్ణము చేయవచ్చు.

ఈ విషపరిస్థితులం విచ్ఛిన్నమైన తరువాత క్రొత్త పథకము అమలులోనికి వచ్చినప్పుడు, నీటి వసతులూ, జల విద్యుత్తూ, గనులలో యంత్రాలూ, పాఠశాలలూ, ఆసుపత్రులూ మొదలైన అధిక వ్యయముతో కూడినవాటిని గురించి ప్రణాళికలు తయారు చేసుకోవచ్చు. ప్రజలకు విశ్వాస మున్నప్పుడు కావలసిన పెట్టు బడిని తామే యిస్తారు. ఆ సమయము వచ్చినప్పుడు విదేశ ప్రభు

త్వాలూ, విదేశ సంస్థలూ పెట్టుబడి పెట్టుటకు వెనుకాడవు. అప్పటికి సింహాసనం మీది బిచ్చగాడు సింహాసనం దిగి కార్య మగ్నుడై యుంటాడు.

---

# 6. సూర్యుని పిల్లలు.

పెరూ దేశంలో సముద్ర తీరంలో లీమా అనే నగరం వుంది. ఆ నగరంలో ఈ శతాబ్దపు నాగరికత అంతా వుంది. పెద్ద పెద్దవ్యాపార సంస్థలనూ, నవ నాగరక వస్తువులమ్మే దుకాణాలనూ, విలువగల దుస్తులు ధరించిన పౌరులనూ అక్కడ చూడవచ్చు. పాన్ అమెరికన్ రోడ్డు లీమా గుండా పోతుంది. దక్షిణా అమెరికాకు పోయే ఓడలన్నీ అక్కడ ఆగి, పోతాయి.

కానీ పెరూ అంతా లీమా మాదిరి లేదు. పెరూ యొక్క నిజ స్వరూపము ఆండీస్ పర్వతాలమీదా, ముఖ్య పట్టణమైన కుజ్కోలోనూ కనబడుతుంది. పూర్వపు "ఇన్కా" రాజ్యంలో గూడా కుజ్కో ముఖ్యపట్టణమే. 16 వ శతాబ్దము నుండీ ఆ నగరమేమీ మారలేదు. ఆ నగర వాసులు నాగరక యూరోపియనుల వలె నుండరు. వారందరూ రెడ్ ఇండియనులే. పురుషులు ఎరుపు, తెలుపు చారలుగల ఉన్నిబట్టలు ధరించి వుత్త కాళ్లతో తిరుగుతూ ఉంటారు. స్త్రీలకు డజన్లకొలదీ గుడ్డలుంటాయి. పురుషులూ, స్త్రీలూ, పిల్లలూ అందరూ ఎర్రని రంగు అద్దిన బొచ్చు టోపీలు – అంచులు పైకి తిరిగినవి – ధరించి వుంటారు.

కుజ్కో ఒకప్పుడు 3000 చదరపుమైళ్ళ విస్తీర్ణము గల

"ఇన్కా" సామ్రాజ్యానికి కేంద్రం. ఆ పట్టణాన్ని నిర్మించడానికి సూర్యభగవానుడే మొట్టమొదట ఒక పురుషునీ, ఒక స్త్రీనీ, భూమి మీదకు పంపినాడని రెడ్ ఇండియనుల విశ్వాసం. ఆ పురుషుడు వ్యవసాయము మొదలైన పురుషుల వృత్తులను రెడ్ ఇండియనుల పురుషులకు నేర్పించెననీ, ఆ స్త్రీ నేతపనీ, కుట్టుపనీ మొదలైన గృహ కృత్యములను స్త్రీలకు నేర్పించెననీ వారి నమ్మకము. వారు ఈ వృత్తులనే ఆదిమ కాలమునుండీ అనుసరిస్తున్నారు.

నూటికి 85 మంది భూమిదున్ని వ్యవసాయము చేసుకుంటూనే వున్నారు. స్త్రీలు సూర్యుని పుత్రిక నేర్పినట్లు బట్టలు నేస్తూనే వున్నారు. వారు నేసిన బట్టలు చాలా అందముగానూ, ప్రజ్ఞా సమన్వితంగానూ ఉంటాయి. ప్రపంచంచేత విస్మరింపబడి, వారు ఆండీస్ పర్వత సానువుల్లో శిలా మయమైన భూములు సాగుచేసుకుంటూ లామా, వికూనా అను పశువుల మందలను సాకుతూ ఉన్నారు. అప్పుడప్పుడూ సన్నని కొండ దారుల్లోబడి, తమ సరుకులను అమ్ముకోడానికి వారు కుజ్కో నగరానికి పోతారు. అప్పుడప్పుడూ పురాతన రాజభవనాన్ని చూస్తూ నిలబడతారు. ఆ భవనము ఒకప్పుడు అతి మనోహరంగా ఉండేది. అందుకే దానిని "ఆశ్చర్యపుముద్ద" అనేవారు. కాని యిప్పుడది శిథిలావస్థలో వుంది. లేదా ఒక్కొక్కప్పుడు వారు సూర్య దేవాలయాన్ని చూస్తూ నిలబడుతారు. కాకపోతే శిథిలమౌతున్న ఆనంద సౌధపు ప్రాంగణాన్ని చూస్తారు. ఇక్కడ ఒకప్పుడు సూర్యదేవుని

ఉత్సవాలు జరిగేవి. ఇప్పుడు అది ఓటలువారి చెట్టుచేమలకు ఆలవాలమైంది.

స్పెయిన్ దేశస్థులవలన ఇన్కా సామ్రాజ్యము సర్వనాశన మైనా, ఇన్ని శతాబ్దాలలోనూ జీవిత పద్ధతులంతగా మారలేదు. "ఫ్రాన్సిస్కో పైజారో" అను వీరుని చేతిలో ఇన్కా రాజవంశ రాజ ప్రాసాదాలు, పవిత్ర స్థలాలూ అన్నీ తీవ్రంగా భంగపడినాయి.

ఇన్కా రాజులను జయించిన తరువాత స్పెయిన్ దేశస్థులు ఆండీస్ పర్వతాలమీద స్థిరపడకుండా సముద్రతీరంవద్గర లీమా నగరాన్ని నిర్మించుకొన్నారు. వీధులూ, భవనాలూ, చర్చీలూ అన్నీ నవీన పద్ధతులలో తయారైనాయి. పర్వతాలమీద మాత్రం 11000 అడుగుల యెత్తున కుజ్కో నగరము క్రమ క్రమంగా శిథిలమౌతూ ఉంది. ఆ నగరంచుట్టూ ఉండే భూముల్లో పూర్వము మాదిరిగానే వ్యవసాయము చేసుకుంటూ రెడ్ యిండి యనులు, జీవిత సంగ్రామము సాగిస్తూ వుండినారు. 1821 విప్లవం వలన స్పెయిన్ దేశీయుల సంకెళ్ళనుండి విముక్తి లభించినా వారి జీవిత పద్ధతులు మాత్రం మారలేదు.

1950 లో వచ్చిన భీషణ భూకంపం ద్వారా కుజ్కో నగరమూ తత్పరిసర ప్రదేశమూ ప్రపంచ దృష్టి నాకర్షించినాయి. గుడిసెలూ, ఇళ్లూ నేలమట్టమైనాయి. అనేకవేలమంది మర ణించినారు. అనేకవేలమంది నిరాశ్రయులైనారు. అసంప

సౌధము రూపు మాసి పోయింది. "ఆశ్చర్యపుముద్ద" శిథిలాల దిబ్బ ఐంది. వీధులూ వ్యాపార ప్రదేశాలూ బీటలు వారినాయి. హతశేషుల హృదయాలు భయ భ్రాంతులతో నిండిపోయినాయి.

ఈవార్త అమెరికా సంయుక్త రాష్ట్రాలకు అందినవెంటనే వారు సహాయము చేసినారు. ఆహర పదార్థాలూ, మందులూ, బట్టలూ మొదలైన సామానులు ఆండీస్ పర్వతాలమీదికి విమానాలలో రవాణా అయినాయి. గాయపడినవారి చికిత్సకొరకు రెడ్‌క్రాస్ సంఘము డేరాలు వేసికొని పని ప్రారంభించింది. పెరూ ప్రభుత్వోద్యోగులు రేయింబవళ్లు తమకు చేతనైన సహాయం చేసినారు.

కొన్ని విపత్తులు, పూర్వముకంటే మంచి పరిస్థితులు సృష్టించుకోడానికి తోడ్పడుతాయి. యుద్ధంలో బాంబులపాలైన ఇంగ్లాండులోని పట్టణాలను తిరిగి కట్టేటప్పుడు పూర్వముకంటె విశాలమైన వీధులూ, మంచి గాలి వెలుతురూవచ్చే గృహాలూ తయారైనాయి. అదేవిధంగా ఇన్కా రాజులు కట్టిన పట్టణంకంటే మంచి పట్టణాన్ని కట్టడానికి పెరూ ప్రభుత్వం తలపెట్టింది.

పూర్వపు పట్టణం కోట గోడలతో రాజ ప్రాసాదాలతో రాజులకు తగినట్లు ఉండేది. ఇప్పుడు మనం కట్టబోయే పట్టణం సామాన్య ప్రజలకు సుఖ సంతోషాలకు నిలయంగా, నివాస యోగ్యంగా వుండగలదు. ఐదు వందల యేండ్లనాటి నాగరికత

వలెనే ఒక గొప్ప వర్ధమాన నాగరికతను నిర్మించే అవకాశము మనకూ ఉన్నది.

"మనకు డబ్బు వుంది. సిగరెట్లూ, చుట్టలూ, పొగాకూ వీటిమీద పన్నువేస్తే ఏడాదికి 20లక్షల డాలర్ల ఆదాయం వస్తుంది. దానిని కుజ్కో నగర పునర్నిర్మాణానికి వినియోగించవచ్చు. కొంతభాగాన్ని కార్మికులకు చిన్నఇళ్ళు కట్టడానికీ, కొంతభాగాన్ని పారిశ్రామిక యంత్రాలకూ, మరికొంతభాగం సొంత యిళ్ళు కట్టుకొనేవారికి అప్పులు ఇవ్వడానికీ ఖర్చు పెట్టవచ్చు. ఇదిగాక చర్చిలూ, చరిత్రాత్మక స్థలాలూ వీటి పునర్నిర్మాణానికి కేటాయించబడిన డబ్బు 40 లక్షల డాలర్లు మనం వాడుకోవచ్చు. ఈవిధంగా డబ్బు కొదువలేదు గాబట్టి వెంటనే పనిప్రారంభించవచ్చు."

ఇటువంటి అభిప్రాయాలతో పెరూ ప్రభుత్వం సాంకేతిక సహాయ సంస్థను సలహా అడిగింది. పట్టణం కట్టినంత మాత్రాన పట్టణంలోని ప్రజలు బ్రతుకజాలరు. అది తన చుట్టూవున్న ప్రదేశంమీద ఆధారపడుతుంది. ఎంత అందంగా అద్భుతంగా ఉన్నాసరే పట్టణాల స్వభావం ఇది. పట్టణాలకు స్వతహాగా ఏమీ విలువలేదు. చుట్టూ ఉన్న దేశంలోని ప్రజల వ్యాపారాలకూ, భావాలకూ, కేంద్రంగా ఉన్నంతవరకే పట్టణాలు అభివృద్ధి చెందుతాయి.

అందువలన సాంకేతిక సహాయసంస్థ పెరూ ప్రభుత్వానికి

ఒక ప్రణాళిక తయారుచేసి యిచ్చింది. కుజ్కో నగర పునర్నిర్మాణమేగాక దానిచుట్టూ ఆండిస్ పర్వతాలమీద నివసించే ప్రజల సౌభాగ్యాన్ని అభివృద్ధి చేయడం ఈ ప్రణాళిక యొక్క లక్ష్యం.

కుజ్కో నగరం కట్టడంలోనూ, పరిసర ప్రదేశాన్ని నివాస యోగ్యం చేయుడంలోనూ, అందరూ ఉత్సాహం కనబరచినారు. దక్షిణ అమెరికాలో ఇంత జనసమ్మర్దంగల ప్రదేశము ఎక్కడా లేదు. స్పెయిన్ దేశీయుల చేతిలో ఈ ప్రజల నాగరికత సర్వ నాశనమైంది. వీరికి తిరిగి ఆరోగ్యమూ, సౌభాగ్యమూ లభిస్తే గతించిన వీరి నాగరికత పునర్వికాసము పొందే అవకాశము ఉన్నది. అందువలన సాంకేతిక సహాయసంస్థ ప్రణాళిక అందరినీ ఉత్సాహ పూరితులను చేసింది.

వెంటనే సాంకేతిక సహాయ సంస్థ సహాయంతో అనేక చరిత్రకారులనూ, పురాతత్వశాస్త్రజ్ఞులనూ నగరనిర్మాణ నిపుణులనూ, వ్యవసాయ శాస్త్రజ్ఞులనూ, సివిల్ ఇంజనీర్లనూ; నీటి వనరుల నిపుణులనూ అనేక దేశాలకు చెందిన వారిని – పెరూ ప్రభుత్వం ఎన్నుకొన్నది. వారందరూ పెరూ దేశానికివచ్చి దీర్ఘమైన పరిశీలనలు జరిపి ఒక పథకమును తయారు జేసిరి. అనేకమంది స్త్రీ పురుషులు వెంటనే పని ప్రారంభించిరి.

శిథిలమైన పూర్వ పట్టణంవలెనే క్రొత్త పట్టణం ఉండ

బోతుంది. నవీన పద్ధతుల భవనాలుకూడ వుంటాయి. పాత రాజ భవనాలూ, వ్యాపార స్థలాలూ, పూజాస్థలాలూ, తిరిగి నిర్మింప బడుతాయి. కుజ్కో వంటి నగరం ప్రపంచంలో ఎక్కడాలేదు. కాబట్టి దాని పునర్నిర్మాణంలో చారిత్రక ప్రాముఖ్యత వుంది. ప్రపంచ ప్రజలు ఆశ్చర్యంతో ఎదురు చూచినారు.

పెరూ ప్రజలకు మాత్రం దీనిలో ఇంకా ఎక్కువ అర్థం ఉన్నది. వారి పూర్వులు సాధించిన ఔన్నత్యము తిరిగి సాక్షాత్కరిస్తుంది. వారి పూర్వుల గొప్పతనమూ, శక్తీ తిరిగి సాక్షాత్కరిస్తాయి.

గోడలూ, మేడలూ ఒక్కొకటే తయారవుతూంటే విశాలమైన వీధులూ, మనోహరమైన బజార్లూ రూపొందుతూంటే చూచిన రెడ్ యిండియనులు తమ దారిద్ర్యాన్నీ, అధోగతినీ మరచి పోయి, ఈ గొప్పతనమంతా తమదేననీ, తాముగూడా సూర్యుని సంతానమేనని భావింపసాగినారు.

ఈ విధంగా కుజ్కో నగరం తిరిగి కట్టబడింది. రాజ భవనాలేకాదు, ఏడాదిపొడుగునా వచ్చే యాత్రికులకొరకు క్రొత్త హొటళ్ళుగూడా తయారైనాయి. పరిశుద్ధమైన నీటివసతి, ఆరోగ్యకరమైన పద్ధతులూ కల్పింప బడినాయి. ఇళ్ళకూ, స్కూళ్ళకూ, ఫ్యాక్టరీలకూ కావలసిన సిమెంటు తయారుచేసే ఫ్యాక్టరీకూడ ఒకటి నగరము వెలుపల నెలకొల్పబడింది.

ఒక వైపున ఈ పనులు సాగుతూ ఉన్నప్పుడే మరికొందరు నిపుణులు నగరముచుట్టూయున్న పొలాలను పరిశీలించినారు. పరిశీలనలో 'ఇన్కా' రాజుల కాలంనాటివలె పంటలు పండటం లేదని తేలింది. ప్రజలేమో తెలివి తేటలతో కష్టపడి పనిచేస్తూనే యున్నారు.

ఇన్కా రాజులకాలంనుండి ప్రపంచం ఎంతో పురోగమించింది. ఈనాడు క్రొత్త వ్యవసాయ పద్ధతులూ, క్రొత్త పనిముట్లూ క్రొత్త ఎరువులూ, శ్రేష్ఠమైన విత్తనాలూ ఉన్నవి. ఇవన్నీ ఐక్యరాజ్య సమితి నిపుణులద్వారా పెరూ ప్రజలకు అందగలవు.

ఇవన్నీగాక నీటి పారుదల విషయంగూడా ఉంది. పూర్వం కొండ వాగులలో పారే నీటిని పొలాలకు పెట్టుకొంటూ వుండినారు. ఇప్పుడా వనరులన్నీ శిథిల మైనాయి. వాటిని తిరిగి తయారు చేసుకొంటే పొలాలకు కావలసినంతనీరు దొరుకుతుంది. నదీ జలాలతో విద్యుచ్ఛక్తిగూడా ఉత్పత్తి చేసుకోవచ్చు.

ఈ విధంగాచెస్తే పర్వత సానువుల్లోని పొలాలన్ని సమృద్ధిగా పండుతాయి. ప్రజలకు తినడానికేకాక అమ్ముకోడానికికూడా పంటలు పండుతాయి.

అసలుసమస్య అక్కడేవుంది. పంటలు విరివిగా పండినంత మాత్రాన దేశం బాగుపడదు. మిగులు సరుకులు అమ్మకమయ్యే

సౌకర్యం ఉండాలి. కొండల్లో కాలి బాటల్లో సరుకులెట్లా సాగుతాయి? సాగినా చాల కొద్దిగానే సాగుతాయి. సరుకులు అమ్ముకోటానికి పట్టణాలకు పోవలయునంటే రైతులకు ఎన్నో దినాల పని ఇంటివద్ద నష్టమౌతుంది. కాబట్టి పెరూ దేశానికి మంచి రహదారులు అత్యవసరం.

ఆండీస్ పర్వతాలలో రోడ్లు వేయాలంటే ఎంతో విజ్ఞానమూ, అనుభవమూ, నేర్పూ కావలసి వుంది. సాంకేతిక సహాయ సంస్థ సిఫారసు చేసిన నిపుణులు సర్వేచేయడం, రాళ్ళను పగుల గొట్టించడం, వాలు స్థలాలను సమతలం చేయడం, రోడ్లు వేయడం, ఈ పనులన్నీ వెంటనే ప్రారంభించినారు.

**1954** లో ఈ పని యింకా సాగుతూనే వుంది. చారిత్రక శిథిలాలకు తిరిగి జీవంపోస్తూ, క్రొత్త గృహాలూ, పాఠశాలలూ, ఆసుపత్రులూ, నిర్మిస్తున్నారు. ఇన్కాల కాలం నుండి మార్పెరుగని ప్రజలు నేడు క్రొత్త పద్ధతుల్లో పంటలు పండిస్తున్నారు. కొండవాగులు పొలాలను తడుపుతున్నాయి. విద్యుచ్ఛక్తి తయారౌతూవుంది. ఈ విధంగా అనేక దేశాలు అనేక శతాబ్దాలుగా సంపాదించిన విజ్ఞానం సూర్యుని సంతానానికి ఉచితంగా లభిస్తూవుంది.

---

# 7. అమెజాన్‌లో అమూల్యమైన వృక్షసంపద.



1952 లో బ్రెజిల్ దేశం సాంకేతిక సహాయ సంస్థను సమీపించి అమెజాన్ లోయలో కలప పరిశ్రమను స్థాపించే విషయంలో నిపుణుల సహాయాన్ని అర్థించింది. ఆప్రదేశం కోతులకూ, పాములకూ, రబ్బరుచెట్లకూ ఆలవాలమైందనీ ఎందుకూ పనికిరాని అరణ్యమనీ చాలమంది అభిప్రాయం. కాబట్టి బ్రెజిల్ అభ్యర్థన అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. అయినా ఆ లోయను పరిశీలించే నిమిత్తం సాంకేతిక సహాయ సంస్థ ఆ సంవత్సరమే కొంతమంది నిపుణులను పంపింది. వారి పరిశీలన పాత అభిప్రాయాలను కొంతవరకు బలపరిచినా కొన్ని క్రొత్త విషయాలను బయలు పరిచింది.

అమెజాన్ లోయలో విలువగల కలపనిచ్చే వృక్షజాతులున్నా అక్కడ నివసించే ప్రజలు అతి దరిద్రులుగా వున్నారు.

ఆ లోయ విస్తీర్ణము ఆస్ట్రేలియాఖండ మంత ఉంది. (ఇండియాకు రెట్టింపు.) ఈ కొననుండి ఆ కొనకు ప్రయాణము చేసినవారు చాల అరుదు. అందులో కొన్ని ప్రదేశాలను శ్వేతజాతి మానవులెవరూ ఇంతవరకూ చూడలేదు. బ్రెజిల్ దేశవిస్తీర్ణములో మూడింటిభాగాన్ని ఆక్రమించిన ఈ లోయలో మానవులను

నిర్వీర్యుల చేయునంత తేమ వుంది. తేమ వలననూ, రవాణా సౌకర్యములు లేకపోవుటవలననూ, అసలు దానిని చూడవలసిన అవసరము లేనందువలననూ అందరూ ఆ లోయకు దూరంగానే యున్నారు. కాని బ్రెజిల్ దేశమంతటినీ సంపన్నం జేయగల కలప ఆ లోయలో వుంది. కాబట్టి అక్కడ జనపదాలు నెలకొల్ప వలెనని బ్రెజిల్ ప్రభుత్వం తలపెట్టింది.

ఆ లోయలో అమెజాన్ నది వుంది. ఆ నదినిబట్టి ఆలోయకు ఆ పేరు వచ్చింది. ఆనది చాల వెడల్పైనది. ఇవతలి గట్టునుండి, అవతలిగట్టు చూచుటకు కనపడదు. పూర్వము సముద్రముమీద దక్షిణ అమెరికా తీరమువెంట వచ్చిన నావికులు తాము నదీ ప్రవేశించినది యెరుగక, అక్కడ ఉప్పునీరు గాక మంచినీరు వుండుటను చూచి ఆశ్చర్యపడినారు. ఒకప్పుడు స్పెయిన్ దేశపు నావికులు ఓడలో ఆనది ప్రవేశించి శరవేగంతో నడుపబడే ఒకపడవను చూచిరనీ, ఆ పడవకు తెడ్లువేసే భయంకరమైన స్త్రీలను చూచి వెనుకకు మరలిపోయిరనీ, ఒక కథ ప్రచారములోవుంది. ఆ స్త్రీలు గ్రీకు పురాణ గాథలలోని అమెజాన్ స్త్రీలవలె నున్నందున వారికాపేరు పెట్టబడిందట. ఈ కథ ఎంతమాత్రము యథార్థమో ఎవరికీ తెలియదు.

నది మాత్రము చాల గంభీరంగా ప్రశాంతంగా ప్రవహిస్తూ వున్నది. దానిని ఇంతవరకూ పరిశోధించినవారులేరు. అతి విశాలమైన ఆ లోయలో అనేక ఉపనదులు ఆండీస్ పర్వతాలలో

నుండి ప్రవహించి ఈ నదిలో కలుస్తాయి. ఉత్తరాన నదీ తీరంలో కొన్ని గడ్డి మైదానాలూ కొన్ని గుట్టలూ ఉన్నవి. తక్కిన ప్రదేశమంతా దట్టమైన అడవి. అనంతంగా కనపడే ఈ నది కొన్నిచోట్ల ఒక మైలు వెడల్పు, మరికొన్నిచోట్ల ఐదుమైళ్ళు వెడల్పు ఉన్నది. లోతులేనిచోట్ల మొసళ్ళు ఉన్నాయి. అడవిలో కొమ్మలమీద కోతులూ, చెట్లనీడలలో బ్రహ్మాండమైన పాములూ ఉన్నాయి. సూర్య కిరణాలు దూరని కీకారణ్యంలో రంగు రంగుల పక్షులూ, అక్కడక్కడ ఆకర్షణీయమైన పూవులూ ఉన్నాయి. అసాధారణమైన వృక్షరాజములు ఆకాశాన్నంటుతూ ఉన్నాయి. వివిధ వృక్షజాతులు 1500 రకాలు ఉన్నాయి.

అమెజాన్ ప్రదేశంలో జనసంఖ్య చాల తక్కువ. చెప్పుకో దగిన పట్టణాలు రెండే రెండు. అందులో పెద్దదైన బెలెంలో 165,000 మంది ఉన్నారు. కాలం బాగుంటే విలాసమయమైన క్లబ్బులూ, హోటళ్ళూ ఉంటాయి. పారిస్‌నుండి దుస్తులు తెప్పించుకొంటారు. తమ పిల్లలను యూరప్‌లో చదివిస్తారు. రెండవదైన మానాసె పట్టణం బెలెంలో మూడింట ఒకభాగం ఉంటుంది. ఆస్ట్రేలియా అంత వైశాల్యమున్న దేశంలో ఇంతమాత్రం పట్టణాలు రెండె ఉండటం అసామాన్య విషయమే.

ఒకప్పుడు ఈ లోయలో టూపి - గ్వారాని అనబడే రెడ్ ఇండియన్ జాతివారు నివసించేవారు. వారు కొంత రహస్య స్వభావము గలవారు. తెల్లజాతి మనుష్యులకు సాధారణముగా

కనపడేవారుకారు. క్రొత్త వారికి కనపడితే కీడు మూడునని వారి విశ్వాసము. కాబట్టి వారి యిళ్ళు అరణ్యామధ్యాలో నుండేవి. ఒకచోట కొంతకాలముంటే వారి యిళ్ళదగ్గరికి కాలిబాట యేర్పడుతుంది. అప్పుడు వారు తమ ఇళ్ళను పరశురామప్రీతి గావించి అరణ్యాములో యింకను దుర్గమ భాగాలు చేరుకొనేవారు. అప్పుడప్పుడు వారందరూ ఒకచోట జేరి విచిత్రమైన ఉత్సవాలు చేసుకొంటారు. అప్పుడు చిన్నచిన్న ఎముకలూ, పక్షుల తలలూ ద్రాక్షతీగల నారతో కూర్చిన హారాలూ ధరించి, చిలుకల ఈకలతో అలంకరించుకొని, మేళాలూ, మద్దెలలూ చేసే సంగీతంతో మధ్య నాట్యం చేస్తారు. సాధారణంగా రెడ్ యిండియన్ జాతులకుండే విల్లు అమ్ములు వీరికి తెలియవు. విషపూరిత బాణాలు విడిచే ఒక విధమైన తుపాకితో వీరు పక్షులనూ, చిన్నచిన్న జంతువులనూ వేటాడుతారు.

విచిత్ర వర్తనులైన ఈ అడవిజాతి మనుష్యులు ఇప్పుడు లేరు. తెల్లవారితో వివాహ సంబంధాలు చేసుకొని కొందరు కలిసిపోగా తక్కినవారు నశించినారు. అమెజాన్ లోయలో ఇప్పుడు ప్రయాణం చేసేవారికి కబోక్లోస్ అను జాతివారి గృహాలు మాత్రం తీరమువెంట అక్కడక్కడ కనబడుతాయి.

కబోక్లోస్ అంటే బుడతకీచులకు, పై రెడ్ ఇండియనులకు కలిగిన సంకరజాతి. అరణ్యంలోనే వారి బ్రతుకుదెరువు. వరదలువచ్చినా ప్రమాదం లేకుండునట్లు వారిగృహాలు నదీ

తీరానికి దూరంగా వుంటాయి. నదివెంట పోయేవారికి ఇండ్లు కనపడకుండా పొదలు అడ్డముంటాయి. కాని నదిఒడ్డున ఉన్న రేవుల మూలంగా వారి ఇండ్లు అక్కడ వున్నట్లు తెలుసుకోవచ్చు. రేవులో ఒక పడవా ఒక కట్టెల మండె వుంటాయి. కట్టెలు ఉపయోగించే ఇంజన్లుగల ఓడలు వచ్చినప్పుడు ఈ కట్టెలు అమ్ముతారు. సుమారు రెండువారాలకొకసారి అడవిలో దొరికిన కాయలు, మొసలి చర్మాలు, రబ్బరు వుండలూ పడవలలో వేసుకొని సమీపములోనున్న దుకాణాలకుపోయి అక్కడ వాటికి బదులుగా డబ్బాలలో నిల్వచేయబడిన పదార్థాలూ, ఉప్పూ, బట్టలూ, కిరసనాయిలూ తెచ్చుకొంటారు. అవసరము వచ్చినప్పుడు ఈ దుకాణాలలో వారికి అప్పుగూడ పుట్టుతుంది.

వారిలో సాంఘిక జీవనం శూన్యం. ఒకరికొకరు చాల దూరంలో నివసిస్తూ దినమంతా కాయకష్టంతో గడపుతూ ఉంటారు. అప్పుడప్పుడు దుకాణదారుడు ఇచ్చే విందులలో పదిమందీ కలుస్తూ ఉంటారు.

అయినా ఒక్కొక్క దుకాణముచుట్టూ ఉండేవారంతా ఒక సంఘముగా ఉంటూనే ఉన్నారు. ఒకరికొకరు అరమైలూ, అంతకంటే ఎక్కువ దూరములోనూ ఉన్నా అభిప్రాయాలు ఇచ్చి పుచ్చుకోడాలు జరుగుతూనే ఉంటాయి. ఉదాహరణకు వారికి తెలిసిన వ్యవసాయంచాల తక్కువైనా అది అందరూ ఒకేపద్ధతిలో చేస్తూవుంటారు. అడవిలో కొంతభాగానికి అగ్గిపెట్టి చెట్టూ చేమా

లేకుండా చేయడం, దానిలో ధాన్యమూ చిక్కడు, మిరియాలు, మేనియక్‌లను పండించడం ఇదీ వీరి వ్యవసాయమంతా. మేనియక్ అనునది విషమయమైన ఒక దుంప. విషమయమైన దాని గుజ్జును నదిలో కడిగివేసి, తరువాత ఎండబెట్టి, చెక్క రోళ్ళలో దంచి పిండితో రొట్టె చేసుకొంటారు. ఈ రొట్టెను "ఫారినాడీ" అగ్వాఅంటారు.

కబోక్లోస్ జాతివారందరూ రోమన్ కాథలిక్ క్రైస్తవులమని చెప్పుకుంటారు. కాని వారు రెడ్ ఇండియన్ విశ్వాసాలను వదలలేదు. జబ్బుచేసినప్పుడూ, గాయాలు తగిలినప్పుడూ వారి వైద్యుని పిలుస్తారు. ఆ వైద్యుడువచ్చి పాటపాడుతూ, నృత్యము చేస్తూ, తాళమువేస్తూ, అప్పుడప్పుడూ పొగాకు పొగను దట్టముగా రోగిమీదికి వదలుతూ జబ్బు నయము చేయమని దేవతలను ప్రార్థిస్తాడు. వారు మేరీ కన్యనూ **(Virgin Mary)** పూజిస్తారు. మేడే అగ్వా **(Mae d'Agua)** అను జలదేవతనూ పూజిస్తారు. వారు పిల్లలకు చెప్పే కథలు క్రైస్తవ భక్తులను గురించీ యుంటాయి. జల కన్యలను గురించీ యుంటాయి.

ఇరువదియవ శతాబ్దపు ప్రారంభంలో మోటారు పరిశ్రమ అభివృద్ధి చెంది టైర్లకు విస్తారంగా రబ్బరు కావలసి వచ్చి నప్పుడు బ్రెజిల్ దేశమంతా ఉత్సాహపూరిత మైంది. మానాస్ మరియు బెలెం **(Manas and Belem)** నగరవాసులు ఐశ్వర్య వంతులం కాగల మనుకొన్నారు. కబోక్లోస్ **(Coboclos)** లు

కూడా ఋణ విముక్తులం కాగలమనీ ఇష్టమువచ్చిన వస్తువులు కొనవచ్చుననీ కలలు గన్నారు.

1913 వరకూ రబ్బరు కొరకు ప్రపంచమంతా బ్రెజిల్ మీదనే ఆధారపడింది. అడవిలోని భూములను పెద్ద ధరలుపెట్టి రబ్బరు కంపెనీలు కొన్నాయి. కొన్ని భూములు రబ్బరు చెట్లే లేనందువలన నిరర్థకమైనా, కొన్ని భూములు రబ్బరుచెట్లు విరివిగా కలిగినవి చాలా లాభాన్ని యిచ్చినాయి. ఆ చెట్లకు రబ్బరుగాదు, నల్లబంగారు కారుచున్నది అని అనేవారు. అటు పంటప్పుడు ఎక్కువగా కూలీలు కావలసి వస్తే కబొక్లొస్ జనుల మీద దాడి చేసి, వారిని తుపాకులతో బెదిరించి బలవంతంగా పని చేయించుకొనేవారు.

ఈ విపరీత పరిస్థితి చాలారోజులు సాగలేదు. కొన్ని సంవత్సరాలకు పూర్వం హెన్రీవిక్హాం అను ఆంగ్లేయుడు బ్రెజిల్‌నుండి కొన్ని రబ్బరు విత్తనాలను రహస్యముగా తీసుకపోయి వాటిని ఒక లండన్ శివారులో నాటి చూచినాడు. అవిబాగుగా మొలిచి నందున ఆంగ్లేయులు మలయాలోనూ, సింహళములోనూ, రబ్బరుతోటలను పెంచిరి. ఆ రెండు దేశాల లోనూ రబ్బరుకు తగినభూమీ, శీతోష్ణస్థితీ ఉండడమేగాక కార్మికులుగూడా విరివిగా దొరుకుతారు. 1913 సంవత్సరంనాటికి బ్రెజిల్‌లో ఉత్పత్తిఅయ్యేటంత రబ్బరు ఆసియాలోనూ అగు చుండెను. 1924 సంవత్సరము వచ్చేసరికి ప్రపంచ రబ్బరు

ఉత్పత్తిలో నూటికి 93 వంతులు అసియాలోనే ఉండెను. అప్పుడు అమెజాన్ లోయకు పూర్వపు దుర్గతి పునఃప్రాప్తించింది.

రెండవ ప్రపంచ యుద్ధంలో, ఆసియాలోని రబ్బరుపండే దేశాలను జపాన్ ఆక్రమించినప్పుడు, రబ్బరుకొరకు తిరిగి అమెజాన్ లోయలోకి పోవుటకు మిత్రరాజ్యాలు ప్రయత్నించినాయి. కాని అప్పటికే కృత్రిమ రబ్బరు తయారు చేయబడుచుండెను. అందుచేత అమెజాన్ లోయకు పూర్వపు స్వర్ణయుగం తిరిగి రానేలేదు.

అమెజాన్‌నదీ దాని ఉపనదులూ ఆలోయలో ప్రవహిస్తూనె యుండెను. తీరముదగ్గర కబోక్లోల ఇళ్ళు, రేవులలో పడవలూ అట్లే యుండెను. అడవులలోని కాయలతోనూ, మొసలి చర్మాలతోనూ, వారు వారికి కావలసిన వస్తువులను కొంటూనే యుండిరి.

ఇన్నాళ్ళూ అడవిలో అమూల్యమైనచెట్లు అట్లే ఉండినవి. వాటి కలప చాల గట్టిదీ, అందమైనదికూడా. కాని ప్రజలు ఆ చెట్లను ఉపయోగించడములేదు. ఎందుకంటే ఆ చెట్లను సరిగా అరణ్యమునుండి బయటతెచ్చి అమ్మటం ఎట్లో ఎవరికీ అర్థంకాలేదు. ఇట్టిపరిస్థితిలో ఐక్యరాజ్యాలలో ఒకటైన బ్రెజిల్ దేశపు అధికార్లు సాంకేతిక సహాయసంస్థయొక్క విజ్ఞానసిధిని ఆశ్రయించిరి. పరిస్థితిని పరిశీలించి లోయను సర్వేచేయుటకు సాం. స. సంస్థ తరఫున ముగ్గురు నిపుణులు బ్రెజిల్‌కు పోయిరి.

ఒక్కొక్క యకరాలలో అక్కరకువచ్చే చెట్లు కొద్దిగాయున్నా అరణ్యముయొక్క విస్తీర్ణము చాల ఎక్కువగా ఉంది. కాబట్టి అందులో లభించగల మొత్తం కలపను తలచుకొంటే దిగ్భ్రమ కలుగుతుందనీ, కలపను రవాణా చేయుటకు ప్రపంచంలో ఎక్కడా ఇట్టి నదీ సౌకర్యములేదనీ ఆ నిపుణులు కనుగొన్నారు.

ఆధునిక కలప పరిశ్రమ పద్ధతులు కబోక్లోలకు తెలియక పోవడంలో ఆశ్చర్యమేమీలేదు. వారు చేతితో చెట్లనుకోసి నదీ దగ్గరకు దొర్లించుకపోవటానికి ప్రయత్నించేవారు. ఫ్యాక్టరీకి చేరేలోపుల ఈ మొద్దులలో మూడింట ఒకభాగము నష్టమయ్యేది. ఐనా కబోక్లోలుగూడా నేర్పితే నేర్చుకోగలరుగదా. రంపాలు పదును పెట్టడం, యంత్రాలు ఉపయోగించడం, మొద్దులను సరిగాపేర్చి ఆరబెట్టడం – ఇవన్నీ వారికి ఐక్యరాజ్యసమితి నిపుణులు నేర్పవచ్చు. ఈ ఉద్దేశంతో ఒక మోడల్ రంపపు ఫ్యాక్టరీ అక్కడ స్థాపించబడింది. కబోక్లోలు అక్కడికివచ్చి నేర్చుకుంటున్నారు.

నదిలోతేలుతూ ఫ్యాక్టరీకిచేరే మొద్దులు కలప పరిశ్రమలో ఒక భాగం మాత్రమే. అమూల్యమైన కలపలో ఏభాగమూ వృథా కాకుండా ప్లైవుడ్, చెక్కపలకలూ, గుజ్జు, కాగితమూ ఇవన్నీ తయారు చేయవచ్చు. అమెజాన్ కలప చాల కఠినమైనది గాబట్టి ఇతరదేశాలలో ఉపయోగించే పద్ధతులను ఇక్కడ కొంత మార్చ వలసి ఉంటుంది.

ఇంక అమ్మకము సమస్య ఉంతనే ఉంది – ఈ ఉష్ణ దేశపు కలపకు ఎక్కడ మంచి ధర వస్తుంది అని. ఇటువంటి కలపను గురించి అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రజలకు ఏమీ తెలియదు, కాబట్టి అక్కడ ఈ కలపకు ధర రాదు. సావోపాలో, రయోడీజనీరో అను బ్రెజిల్ దేశపు పట్టణాలలో గృహ నిర్మాణానికి గట్టికలపను విస్తారంగా ఉపయోగిస్తున్నట్లు నిపుణులు గమనించిరి. ఆ కలపలో పదింట ఒకభాగము మాత్రమే అమెజాన్ నుండి వస్తూయుంది. తక్కినది ఇతరచోట్లనుండి వస్తూయుంది. కాబట్టి ఈ కలప అమ్మకం ముందు బ్రెజిల్‌నే అభివృద్ధిచేస్తే, తరువాత విదేశాలకు ఈ కలపను గురించిన వార్తలు వ్యాపిస్తే, అనేక సంవత్సరాల వరకూ ఈ వ్యాపారం సాగుతుంది.

మొదట పరిశీలక సంఘం బ్రెజిల్‌కు పోయిన సంవత్సరం తర్వాత ఆ అరణ్యంలోని నిశ్శబ్దం భంగం చేయబడింది. చెట్లను నరకడానికి అనువైన స్థలాలను గుర్తు పెట్టుకొంటూ విమానాలు వెనుకకూ ముందుకూ తిరుగుతూ ఉన్నవి. భూమిని చదునుచేసి రోడ్లూ, రైలుమార్గాలూ వేస్తూ వున్నారు. రంపపు ఫ్యాక్టరీలు పెట్టుచున్నారు. నదిమీద ఓడలో బ్రెజిల్‌దేశములోని వివిధ ప్రాంతాల మనుష్యులు ఇక్కడికిచేరి కలప పరిశ్రమలో క్రొత్త జీవితాలను స్థాపించుకొంటున్నారు. పూరిగుడిసెలలోని కబోక్లొ స్త్రీ పురుషులు తమకూ తమకుటుంబాలకూ గల వుజ్జ్వల భవిష్యత్తును గురించి సుఖ స్వప్నాలు కంటున్నారు.

---

# 8. యుగోస్లేవియాలో ఫ్యాక్టరీలు.

యుగోస్లేవియా మొదటినుండీ వ్యవసాయదేశం. అక్కడక్కడ పర్వతాలు వున్నా దేశంలో ఎక్కువగా విశాల మైదానాలున్నాయి. భూమిలో కొంచెంలోతులో సున్నపురాయి వున్నది. మట్టిమరీ పలుచగా వున్నచోట్ల రైతులు మైమన్నుపోసి వర్షానికి కొట్టుకపోకుండా చెక్కలతో బిగిస్తారు. తరువాత ఎద్దులుకట్టి కర్రనాగళ్ళతో దున్ని గోధుమా, మొక్కజొన్నా విత్తుతారు.

దక్షిణ ప్రాంతంలో కొంతమంది రైతులు నిమ్మతోటలు వేస్తారు. పశువులూ, గొర్రెలూ, పందులూ, కోళ్ళూ, బాతులూ వీటి పెంపకం దేశమంతా సాగుతూవుంది.

సముద్రతీరంలో కొంతమంది చేపలు బట్టేవారున్నారు. వాళ్లైనా ఎక్కువమందిలేరు, ప్రజలకు అన్నిటికంటే ఎక్కువగా నచ్చిన వృత్తి వ్యవసాయమే. పగలంతా పనిజేసి సాయంత్రం మద్యమమ్మే హోటళ్ళలో గుమిగూడి సిగరెట్లతో, ఖాతాఖానీతో, లేదా పాటలుపాడుతూనో కాలక్షేపం చేస్తారు. అప్పుడప్పుడు వినోదసమయాలలో అందరూకలిసి ఒకరిచేతులొకరు పట్టుకొని చుట్టూ తిరుగుతూ పాదాలతో తాళంవేస్తూ దేహాలు ఊపుతూ "కోలో" అనే నాట్యం చేస్తారు.

ఈ పనులన్ని యుగోస్లోవియాలో ఇంకా సాగుతూనే వున్నాయి. అయినా గడచిన పదేళ్ళలో దేశంలో ఎన్నో మార్పులు వచ్చినాయి. రెండవ ప్రపంచయుద్ధంలో పదిలక్షల మందికిపైగా మరణించినారు. దేశంమొత్తంలోని పురుషులలో నూటికి పది మంది మరణించగా, ఇంకా అనేకవేలమంది వికలాంగు లైనారు.

యుగోస్లేవియాను ఆక్రమించడం సులభమని జర్మనుల అంచనా. అది వ్యవసాయదేశం కాబట్టి కావలసినంత ఆహార పదార్థంకూడా లభిస్తుందని వారికి తెలుసు. వారు దేశంలో ప్రవేశించినంతనే ఆ దేశపు రాజైన రెండవ పీటర్ అను బాలుడూ, అతని పినతండ్రి పాల్, ఇరువురూ విదేశాలకు పారి పోయిరి. తమ్మడ్డగించిన గ్రామాల సన్నిటినీ భస్మ పటలం గావిస్తూ జర్మనులు ముందుకుసాగిరి. అగ్నిజ్వాలలను గాంచి భయకంపితులైన స్త్రీ పురుషులు పొలాల వెంబడి పరుగెత్తి పోయిరి. దిక్కులేనిపిల్లలు అడవులలోనూ గుహలలోను తలదాచు కొనిరి.

అప్పుడు జర్మన్ సైనికులు తమకు దొరికిన ఆహారాన్నం తటినీ సంగ్రహించుకొన్నారు. ఆవులూ, పందులూ, గొర్రెలూ అన్నీ వాళ్ళపాలే. కోళ్ళుస్వాహా. గోధుమమళ్ళూ బీటు దుంప పండే పొలాలూ, పండ్ల తోటలూ అన్నీ రణరంగాలైనాయి. ధాన్య మంతా జర్మనుల వశమైంది. వారు వంతెనలు పగులగొట్టి,

రైల్వేలను నాశనముజేసి గుర్రాలన్నిటినీ తరలించుక పోయినారు.

ప్రజలకు తినడానికేమీ మిగల్లేదు. సాయుధులైన శత్రువు లతో పోరడానికి వారికి ఆయుధాలు లేవు.

అక్షరాజ్యాలను బహిరంగంగా ప్రతిఘటించ లేకపోయినా, యుగోస్లేవియా ప్రజలలో రెండు రహస్య ఉద్యమా లుండినాయి. ధైర్యసాహసాలతో వారు కరపత్రాలు అచ్చువేయడం, నాటు బాంబులు తయారు చేయడం, రహస్యదాడులు చేయడం, ఇటు వంటి పనులు వారు చేస్తుండినారు. ఈ రెండు ఉద్యమాలలో "చెట్‌నిక్స్" అనబడే ఒక సంఘానికి డ్రాజా మిహాజ్లోవిక్ **(Draza Mihajlovic)** నాయకుడు. ఈ సంఘం ఉద్దేశ్యం పారిపోయిన రాజును తిరిగి సింహసనాసీనుణ్ణి చేయడం. "పార్టిజాన్స్" **(Partijans)** అనబడే మరొక సంఘానికి "జోసిప్ బ్రోజ్" **(Josif Broz)** నాయకుడు. అతనినే "టిటో" **(Tito)** అంటారు. రైతులంతరూ "టిటో" అనుయాయులే. తరువాత రష్యా సహా యంతో వారు జాతీయ విముక్తి సైన్యాన్ని నిర్మించినారు.

యుగోస్లేవియా ప్రజలు తమకు వ్యతిరేకంగా ఉన్నారని తెలుసుకొని మిహాజ్లోవికూ, అతని అనుచరులు "చెట్‌నిక్స్" నిరాశాహతులై అక్షరాజ్యాలతో సహకరించడానికి ప్రయత్నించినారు. కానీ అప్పటికే సమయము మించిపోయి వారి నాటకము బట్ట

బయటపడింది. "చెట్నిక్స్" సభ్యులందరూ ఎవరి దారిన వారు పోయినారు. మిహజ్లోవిక్‌ను పట్టుకొని, బంధించి, ఉరితీసినారు. టిటో, అతని అనుచరులైన పార్టిజాన్స్‌తో అధికారంలోనికి వచ్చినాడు.

ఈ విధంగా యుద్ధం అంతమయ్యేటప్పటికి టిటోయే యుగొస్లేవియా భవిష్యత్తును నిర్ణయించేవాడైనాడు. దేశంలో కొన్ని పరిశ్రమలున్నా ప్రజలలో అధిక సంఖ్యాకులు రైతులు; అన్ని దేశాల రైతులవలెనే వారూ దరిద్రులు.

దీనినంతటినీ మనం మార్చుదాము. మన పర్వతాలలో విలువగల ఖనిజాలున్నవి. మన భూమిలో నూనె వుంది, బొగ్గు వుంది. పర్వతాలనుండి పారే నదులలో శక్తి వుంది. పాశ్చాత్య దేశాలవలెనే మనదేశంకూడా పారిశ్రామికదేశం కాగలదు.

మన ప్రజలలో పదిలక్షలమంది యుద్ధంలో హతులైనమాట నిజమే. ఇంకా అనేకవేలమంది క్షతగాత్రులైనమాట నిజమే. అయినా మనదేశంలో ఇంతవరకూ మనముపయోగించని సంపద వుంది గాబట్టి మనమూ గొప్పతనాన్ని (ఔన్నత్యాన్ని) సాధింపవచ్చు. ఈ విధంగా టిటో ఉద్బోధించినాడు.

తరువాత వెంటనే జల విద్యుత్తును ఉత్పత్తి చేయటానికి "టిటో" ప్రభుత్వం ఉపక్రమించింది. మోకాలిలోతు నీళ్ళలో

నిలబడి కార్మికులు ఆనకట్టలకు పునాదులు త్రవ్వినారు.కొండలలో సొరంగములు తొలచి కాలువలుత్రవ్వినారు. ఈ ఆనకట్టలలో ఒక్కదానివలనే రష్యాలో "నీపర్‌స్ట్రాయ్" ఆనకట్టవలన ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తిలో మూడింట రెండు వంతులు ఉత్పత్తి కాగలదు. తమ భుజబలముతప్ప, ఏబలమూ, ఏనాడూ యెరుగని కార్మికులకు విద్యుచ్ఛక్తి వలన క్రొత్తబలమూ క్రొత్తశక్తి లభిస్తాయి.

ఆనకట్టలు ప్రారంభమైన వెంటనే యంత్రసాధనాలూ, ఇంజన్లూ, ట్రాక్టర్లూ, లారీలూ, మిషన్లూ, వీటిని తయారుచేసే ఫ్యాక్టరీల నిర్మాణం ప్రభుత్వం మొదలు పెట్టింది.

"టిటో" యొక్క పారిశ్రామీకరణ ప్రణాళిక ఎంతో ఉత్సాహంతో నిర్వహింపబడింది. కొంతకాలానికి విద్యుచ్ఛక్తి సిద్ధమైంది. ఫ్యాక్టరీలు తయారైనవి. విదేశాలనుండి వచ్చిన యంత్రాలు బిగింపబడినాయి.

కాని ఆయంత్రాలను నడిపేవాళ్ళులేనిదే ఫ్యాక్టరీలు పని చేయవు. ఈ క్రొత్త ఫ్యాక్టరీలలో పనిచేయడానికి వచ్చిన వారందరూ రైతులే. వారికి దున్నటం, విత్తటం తెలుసుగాని యంత్రాలు నడపటం తెలియదు. యంత్రాలను చెడిపోకుండా చూచుకోవటం కూడా వారికి తెలియదు. వారి అశ్రద్ధవలన విలువైన యంత్రాలు చెడిపోవచ్చు.

ఫ్యాక్టరీలు నడపటానికి కావలసిన సాంకేతిక సలహాల నివ్వడానికి ఐక్యరాజ్యసమితి సిద్ధంగా వుంది. ఫ్యాక్టరీ పద్ధతిలోని సంప్రదాయాలు పారిశ్రామిక దేశాలలో బాగా అభివృద్ధి చెందినాయి.

కాబట్టి యుగోస్లేవియా ప్రభుత్వం తన సమస్యలను సాంకేతిక సహాయసంస్థ యెదుట బెట్టింది.

"మాకు కార్మికులు తక్కువైనారు. మా ప్రజలెంతో మంది యుద్ధంలో మరణించినారు. ఉన్నవారు శిక్షణ లేనివారు. కానీ శిక్షణయిస్తే నేర్చుకొంటారు" అని యుగోస్లేవియా ప్రభుత్వం చెప్పింది.

దీర్ఘమైన చర్చల అనంతరం యుగోస్లేవియా పరిశ్రమల సహాయార్థం ఒక ప్రణాళిక తయారు చేయబడింది. 1952 జూలైలో 400 మంది "ఫోర్మనులు" యుగోస్లేవియాకు పోయినారు. యంత్రాలను యెట్లు నడపవలసిందీ, వాటిని యెట్లునడిపితే అత్యుత్తమ ఫలితాలు లభించేదీ, యంత్రాలు చెడిపోకుండా యెట్లు చూచుకోవలసిందీ, వారు కార్మికులకు ఫ్యాక్టరీలలోనే నేర్పించినారు.

సుశిక్షితులైన ఈ ఫోర్మన్‌లు అనేక భిన్నదేశాలనుండి వచ్చినారు. అనేక సంవత్సరాల అనుభవమూ, పాటవమూ వారు వెంట తెచ్చుకున్నారు. వీరినుండి సాంకేతిక విజ్ఞానాన్ని గ్రహించిన

యుగోస్లేవియా దేశస్థులు ఆ విజ్ఞానాన్ని ఇంకా విస్తృతంగా ఇతరులలో వ్యాపింప జేస్తారు.

విదేశఫోర్మనులు యుగోస్లేవియా ఫ్యాక్టరీలలో శిక్షణ యిస్తున్నప్పుడే, 200 మంది యుగోస్లేవియా కార్మికులు విదేశాలకు పంపబడినారు. ఒక్కొక్క ఫ్యాక్టరీకి ఒక్కొక్కరువంతున పోయినారు. 75 ప్రముఖ పారిశ్రామిక సంస్థలచేత నడుపబడే ఫ్యాక్టరీలలో, 19 విభిన్న వృత్తులను అభ్యసించినారు. ఆస్ట్రేలియా బెల్జియం, ఫ్రాన్సు, జర్మనీ, నెదర్‌లాండ్సు, స్విట్జర్‌లాండు దేశాలకు వారు పోయినారు. విద్యుచ్ఛక్తి ఉపకరణాలూ, యంత్ర పరికరాలు తయారుచేయడం, నౌకానిర్మాణం, నూనెగనులు త్రవ్వడం, పెట్రోలు శుద్ధిచేయడం, రైలు యింజన్ల ఉత్పత్తి, గాజు పరిశ్రమ, లారీల నిర్మాణం, మొదలైనవి వారు నేర్చుకొన్న విద్యలు.

ఐక్యరాజ్య సమితికి చెందినవారు యుగోస్లేవియా కార్మికుల పురోగమనాన్ని ఆసక్తితో గమనిస్తూవుండిరి. ఫ్యాక్టరీల ఉత్పత్తిలో పెరుగుదలవారికి తృప్తినిచ్చింది. సాంకేతిక సహాయ సంస్థయొక్క 1953 సంవత్సరపు రిపోర్టులో ఈ విధంగావుంది.

"స్మెడెరెవో కర్మాగారంలో ముగ్గురు వేల్స్‌దేశపు నిపుణులు ఉక్కు ఉత్పత్తి చేయటంలోనూ, కళాయి వేయటంలోనూ ఉత్తమపద్ధతులు నిరూపించారు. త్రెపెకా ప్రాంతములో సీసపు

కర్మాగారంలో ఉత్పత్తికి నూటికి 50 పాళ్లు పెరిగిందనీ, ఆ పెరుగుదల త్వరలోనే రెండింతలు కాగలదనీ, ఆ పెరుగుదలకు కారకుడైన ఫ్రెంచి నిపుణుడు చెప్పినాడు. కార్మికులకు శిక్షణ యివ్వటానికీ, పనిచేసే పద్ధతులలో మార్పులు సూచించటానికీ, అధికోత్పత్తి కొరకు అవసరమైన పారిశ్రామిక పాటవాన్నీ, పారిశ్రామిక సత్సంప్రదాయాలనూ, నెలకొల్పడానికీ శిక్షకులు ప్రయత్నాలు చేస్తూనే వున్నారు".

విదేశాలతో పరిచయంవలన కార్మికులదృష్టి విశాలమైనదనీ ప్రపంచాన్ని గురించిన భావనలో మార్పువచ్చిందనికూడ పై రిపోర్టులో పేర్కొనబడింది.

కార్మికులన్నప్పుడు, సర్వాంగాలూ కలిగి పుష్టిగా ఆరోగ్యంగా వున్నవాళ్ళు అని అనుకోవడం ఎవరికైనా సహజమే, కానీ యుద్ధరికార్డుల ప్రకారం యుగోస్లేవియాలో 80895 మంది వికలాంగు లున్నారు. ఇంకా యుద్ధకార్యాలయ రికార్డులలో యెక్కకుండా యుద్ధకాలంలో బాంబులవలనా, రోగాలవలనా వికలాంగు లైనవారు ఐదులక్షల మంది వున్నారు. వీరిలో ఒక భాగానికి అవసరమైన డాక్టర్లుగానీ, ఆసుపత్రి సౌకర్యాలుగాని దేశంలో లేవు.

ఈ వికలాంగ సమూహానికి సహాయం చేయడానికీ, వీలైనంత మందిని సంఘానికి ఉపయుక్తమైన సభ్యులనుగా మార్చడానికీ

యుగొస్లేవియా ప్రభుత్వం తిరిగి సాంకేతిక సహాయసంస్థయొక్క తోడ్పాటును అర్థించింది. ఆ దేశంలోని పరిస్థితులను పరిశీలించ డానికి, వికలాంగుల పునరావాస విషయంలో ప్రముఖ పండితు డైన డా. హెన్రికెజ్లర్‌ను సాంకేతిక సహాయసంస్థ ఈ మధ్యనే యుగోస్లేవియాకు పంపింది.

పరిస్థితులను పరిశీలించిన డా. కెజ్లర్ "ఈ వికలాం గులలో చాలమందిని ఊత కర్రల సహాయం లేకుండానే నడిచేటట్లు చేయవచ్చు. తగినశ్రద్ధ తీసుకొంటే చాల మంది తమ చేతులలో పనిచేయడానికి వీలుంటుంది." అని అన్నాడు.

డా. కెజ్లర్ సూచన ప్రకారం ముగ్గురు పురుషులూ ఇదు గురు స్త్రీలూగల ఒక జట్టు యుగోస్లేవియాలో పునరావాస కార్య క్రమం ప్రారంభించింది.

ఒక వికలాంగునికి మామూలు జీవితం తిరిగి ప్రసాదించా లంటె ఒక జట్టు కలిసి పనిచేయాలి. ఒక కృత్రిమాంగాల నిపు ణుడూ, ఒక వైద్యుడూ, ఒక శస్త్రవైద్యుడూ, ఒక జీవనాధార వృత్తులలో సలహాల నివ్వగల నిపుణుడూ, ఒక వైద్యశాస్త్ర దర్శ కుడూ, వీరందరినికలిపి అజమాయిషీచేసే ఒక నిర్వాహకుడూ— ఇంతమంది కావాలి. ఒక్కడొక్కడుగా వీరిలో యెవరూ యేమీ చేయలేరు.

పై జట్టులోని ఎనిమిదిమంది నిపుణులూ, తాము చేయ బోయే పనులలో ప్రవీణత సంపాదించుకొనే నిమిత్తం న్యూజెరిసీ లోని ఈస్ట్ ఆరెంజిల్లోగల కెజ్లర్ పునరావాస సంస్థలో కొన్నాళ్ళు పనిచేసేటందుకు పిలువబడినారు. అక్కడ వారు కెజ్లర్‌తో కలిసి పనిచేయుచూ అనేక విషయములు నేర్చుకొన్నారు. కృత్రిమ పాదాలుగల స్త్రీలుగానీ, పురుషులుగానీ, శిశువులుగానీ మరల నడవటం నేర్చుకోవలెనంటే ఎన్నాళ్ళు ఎంత కష్టపడవలసిందీ వారు తెలుసుకొన్నారు. వికలాంగులు యంత్రాలు నడపటం, అచ్చుకూర్చటం వారు చూసినారు. జీవితమే అంధకార బంధుర మైన వారిముఖాలలో తిరిగి ఆశకనబడడం వారు గమనించినారు.

ఈ నిపుణులచేత యుగొస్లేవియా ముఖ్యపట్టణమైన బెల్‌గ్రేడు లో ఒక కేంద్రం నిర్మింపబడుతుంది. వీరు ఇతరులకు శిక్షణ యిస్తారు. వికలాంగులంతరూ ప్రపంచ కార్యక్రమంలో తాము పాలుపంచుకోవటం నేర్చుకొంటారు.

ఒక మనిషివలెనే, దేశంకూడా ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉండదు. ఐక్యరాజ్యసమితి సలహాల ననుసరించి యుగో స్లేవియాలో వ్యవసాయదారులు పారిశ్రామిక కార్మికులౌతున్నారు. ఎందుకూ పనికిరాని వారమని అనుకొంటూ యుండిన వికలాం గులు క్రొత్తప్రణాళికలో భాగస్వాములౌతున్నారు.

---

# 9. ఈజిప్టులో మహత్తర నిర్మాణం.

పురాతన ఈజిప్టును గురించీ, కర్నక్ దగ్గరున్న దేవాలయం యొక్క అందాన్ని గురించీ థీబ్స్‌వద్దనున్న "రాజులలోయ" లో గల గోరీల వైభవాన్ని గురించి, అనేకులు ఎక్కువగా చదివి యుంటారు. కానీ వారిలో చాలామంది ఈనాటి ఈజిప్టును మరచి పోతారు. నైల్‌నదీ తీరాలలో ప్రజలు క్రిక్కిరిసి వుండటం, ఐశ్వర్య విలాసాలు కొద్దిమందికి మాత్రమే దక్కటం, దారిద్ర్యంతో అజ్ఞానంతో అనేకులు బాధపడటం, వారికి జ్ఞాపకముండదు.

ఆధునిక ఈజిప్టుకుగూడా ఒక చరిత్ర వుంది. ఆ చరిత్ర 19 వ శతాబ్దారంభంలో మొదలౌతుంది. అప్పటికి టర్కీ సామ్రాజ్యంలో ఈజిప్టు ఒకరాష్ట్రం. సామాన్య సైనికుడైన మహమ్మద్ అలీ అనునతడు స్వప్రయత్నమువలన ఆరాష్ట్రానికి పాషా (గవర్నర్)గా నియమింప బడినాడు.

నెపోలియన్ సైన్యాలను ఓడించి తరిమివేసినది మహమ్మద్ అలీయే. తరువాత 1811లో ఇతడు రాజవంశీయుల నందరినీ హతమార్చి అధికారమంతటిని కైవసము జేసుకొన్నాడు. అతడు అధికారంలోనికి వచ్చినంతటనే చేసిన పనులు, ఈజిప్టులోని మొట్టమొదటి ఆసుపత్రిని కట్టించటం, అల్ అజార్‌ల్ ఒక గొప్ప

మత విద్యాలయం స్థాపించటం – ఈ విద్యాలయమే తరువాత యావత్ మధ్యప్రాచ్యానికీ ముస్లిం సంస్కృతీ కేంద్రమైంది.

అతనికి ఈజిప్టుదేశపు ఆర్థికాభివృద్ధియందుగూడా ఆసక్తి ఉండింది. కావున అతడు ప్రత్తిపంట ప్రారంభించి కొన్ని ఫ్యాక్టరీలు నిర్మించి, మధ్యధరా సముద్రంలో ఈనాటికీ ఒక ముఖ్యరేవు పట్టణమైన అలెగ్జాండ్రియా రేవును అభివృద్ధి జేసినాడు.

ఈతని పనులకు టర్కీ ప్రభువులు ఆకర్షింపబడి పాదుషా పదవిని ఇతనికి వంశ హక్కుగా జేసిరి. ఇతని వంశీకులే చాలా యేండ్లు ఈజిప్టును పాలించిరి.

ఈ మహమ్మదాలీ మరణించిన కొన్ని యేండ్లకు 1882లో ఈజిప్టుపైనా, సూయజ్ కాలువపైనా ఇంగ్లండు పెత్తనం సంపాదించెను. సూయజ్ కాలువ మధ్యధరా సముద్రమును, ఎర్రసముద్రమునూ కలుపుతూ ఇంగ్లాండుకు దూరప్రాచ్యంతో ఉన్న వ్యాపారానికి ముఖ్యమైన రహదారిగా ఉంది.

తమదేశం ఇంగ్లీషువారి హస్తగత మైందని చాలామంది ఈజిప్టియనులు గుర్తించలేదు. ధనిక భూస్వాములు తమ పనులలో తాము నిమగ్నులైయుండిరి. రైతులకు తమ దారిద్ర్యమే మోయలేనంత. మధ్యప్రాచ్యంలోని అనేక యితర ప్రదేశాలలో వలెనే ఈజిప్టులోగూడా తారతమ్యాలు ఎక్కువగా వున్నాయి.

భూమి దాదాపు అంతా ధనవంతుల చేతులలో ఉంది. వారు విలాసమైన సౌధాలలో నివసిస్తూ, తమ పిల్లలను యూరప్‌లో చదివిస్తూ, తమ దుస్తులను పారిస్‌లో కొంటూ యుండేవారు.

కానీ రైతులందరూ దరిద్రులు. తమవికాని భూములలో రోజుకు 8 సెంట్లు కూలికి పనిచేస్తూ నైలునదీ తీరంలో గుమిగూడి బ్రతుకుతూ వుంటారు. అరబ్ భాషలో రైతులను ఫెల్లాహీన్ అంటారు. వారికి చదువురాదు. ఆకలి తీరదు. అందులో చాలా మంది రోగిష్టులుగూడ.

ఈజిప్టులో అతి ధనవంతులూ ఉన్నారు, అతి దరిద్రులూ వున్నారు, కాని మధ్యతరగతిలేదు. అనగా "మీకాళ్ళమీద మీరు నిలవండి. విదేశీప్రాబల్యానికి లోనుగాకండి" అని చెప్పగలిగిన విద్యావంతులుగల వర్గంలేదు.

కానీ కళ్ళయెదుట జరిగేదాన్ని చూడగలిగినవాడు ఫెల్లాహీన్‌లో ఒకడుండినాడు. అతనిపేరు సాద్‌జఘులుల్. అందరి వలెనే బీదవాడైనా అతనికి తన దేశాభివృద్ధిని గురించి ఆశ లుండినాయి.

అందువలన అతడు దేవాలయములోని బడిలో కురాన్ నేర్చుకున్న తరువాత అల్‌అజార్‌లో విద్య నభ్యసించడానికి

ప్రయత్నంచేసి నెగ్గినాడు. తరువాత వకీలై రాజకీయాలలో ప్రవేశించినాడు. ఇవన్నీ ఎట్లు సాధించినాడో మనకు తెలియదు.

స్వేచ్ఛ, స్వాతంత్రము, జాతీయత అనేవి జఘలుల్ హృదయములో శౌర్యాన్ని, స్వాభిమానాన్ని రేకెత్తించేవి. వీటిని తన దేశానికి కూర్చేటందుకు ప్రాణంకూడా యివ్వగల వీరుడతడు. విదేశప్రాబల్యమునుండి తప్పించుకుంటే తప్ప తన దేశానికి భవిష్యత్తులేదని అతని నమ్మకం.

క్రమంగా జఘలుల్ ప్రభుత్వంలో ఉన్నతోద్యోగాలు సంపాదించినాడు. మొదటి ప్రపంచ యుద్ధమునాటికి అతడు ఈజిప్టులో ఒక ప్రముఖ వ్యక్తి. "ఈజిప్టుకు బ్రిటన్‌తోగల సంబంధాలను త్రెంచండి. ఈజిప్టుస్వేచ్ఛను సంపాదించండి" అని అతడు ప్రచారంచేస్తూ వుండేవాడు.

ఇంగ్లీషువారు అతనిని నిర్బంధించి జిబ్రాల్టర్ జైల్లో పెట్టినపుడు, ఆలోచించుకోటానికీ భవిష్యత్తుకు పథకం వేసుకోటానికీ అతనికి వ్యవధి దొరికింది. విడుదల పొందిన తరువాత అతడు కొంతమంది అనుచరులతో కలిసి కైరోలోని బ్రిటిష్ రాయబారికి ఒక విన్నపం అందజేసినాడు. ఈజిప్టునుండి బ్రిటిష్ సైన్యాలను ఉపసంహరించు కొమ్మని ఆ విన్నపం. ఈ అనుచరులతోనే వాఫ్డ్‌పార్టీ అనబడే ఈజిప్టు జాతీయపార్టీ స్థాపించ బడింది.

జఘులుల్ మరణానంతరంకూడా వాఫ్డ్‌పార్టీ తన ఆందోళన మానుకోలేదు. 1923లో ఈజిప్టుకు స్వాతంత్ర్య మిచ్చినట్లు బ్రిటన్ ప్రకటించి, ఫు ఆద్ ను రాజును జేసింది.

1936లో ఫు ఆద్ కొడుకు, 18 యేళ్ల వయస్సుగల ఫరూక్, రాజ్యానికి వచ్చినాడు. ఫరూక్ క్రీడా ప్రియుడు. రాత్రి క్లబ్బులంటే సరదా.

ఖరీదైన అనేక మోటారుకార్లూ, నైలునదిలో 20 విహార నౌకలూ, ఒక పెద్ద నౌకా, "స్వర్గఖండాలు" అనబడే డజన్ ప్రదేశాల్లో డజన్ అంతఃపురాలూ, బంగారు పండేటటువంటి 29 వేల యెకరాల భూమీ, లెక్కలేనంత బంగారమూ, విదేశీ కంపెనీలలో షేర్లూ, ఇవి అతని ఆస్తి.

తన ప్రజలను సంతోష పెట్టాలనికూడా అతడు కొన్ని ప్రయత్నాలు చేసేవాడు. ఆ ఉద్దేశంతోనే ప్రజలందరికీ తన దర్శనం లభించాలని అతడు ఒక్కొక్క శుక్రవారం ఒక్కొక్క మసీదుకు పోయేవాడు. అప్పుడప్పుడు మారు వేషం వేసికొని బజార్లకు పోయేవాడు. "రాజు మారువేషంలో వస్తున్నాడు తప్పుకోండి" అంటూ రాజభటులు ముందు నడిచేవారు. ఒకసారి తన ప్రజలకు ఉచితంగా చెప్పులు పంపకం చేయాలని 20 వేల జతలకు అమెరికాకు ఆర్డరు యిచ్చినాడు. కాని ఈ పని నెరవేరలేదు. ప్రజలకు చెప్పులు ముట్టనేలేదు.

ఐశ్వర్యమూ అధికారమూ ఎంతవున్నా అభ్యుదయ శక్తులను ఫరూక్ నిరోధించలేక పోయినాడు. 1950 ఎన్నికలలో వాఫ్ద్ పార్టీకి విజయం లభించింది. 1952లో స్వయం నియమిత సర్వ సైన్యాధ్యక్షుడు మేజర్ జనరల్ నగీబ్ రాజాంతఃపురాన్ని చుట్టు ముట్టి, ఫరూక్‌ను రాజ పదవికి రాజీనామా యిచ్చేటట్లు చేసినాడు. బంగారమూ, కంపెనీల షేర్లూ రాజుకు దక్కినాయి. కానీ భూములన్నీ ప్రభుత్వ వశమైనాయి. నౌకలూ, కార్లూ, గుర్రాలూ, ఆభరణాలూ మొదలైనవన్నీ వేలం వేయబడి వచ్చిన ఆదాయ మంతా ప్రభుత్వ ఖజానాలో చేర్చబడింది.

ఈజిప్టులో మార్పులు రాబోతున్నాయని ఫెల్లాహీనులు గ్రహించినారు. నగీబ్ ఫోటోను మట్టి గుడిశెలలో తగిలించు కొన్నారు. నగీబ్‌ను చూడాలనీ, అతన్ని తాకాలనీ, అతని చేతిని ముద్దు పెట్టుకోవాలనీ, వారు తాపత్రయ పడేవారు. నగీబ్ అధికా రానికి రావడంతో రోజులు మారాయని వారి విశ్వాసం.

ఈజిప్టులో అధికారానికి వచ్చిన క్రొత్తనాయకులు చేయవ లసిన పని బ్రహ్మాండమంత వుంది. ఈ శతాబ్దం లోనే జనాభా రెండంతలైంది. స్వంత భూమిలేని రైతులు ఒక కోటీ ముప్పై లక్షల మంది వున్నారు. మధ్యప్రాచ్యంలో నూలు ఉత్పత్తిలో ప్రముఖ దేశంగా ఈజిప్టు మారుతున్నది గనుక నూలు మిల్లు లలో చాల మంది కార్మికులున్నారు. ఎక్కడ చూచినా ఆకలి తాండవిస్తూ వుంది. ప్రజలకు తగినంత ఆదాయమూలేదు, సరి

యైన ఆహారమంటే ఏమిటో తెలియదు - సరియైన ఆహారము కళ్ళచూడక యెన్నాళ్ళైందో. ఎక్కడ జూచినా అజ్ఞానమూ; మూఢ నమ్మకాలూ; నూటికి ఎనభై మందికి చదువురాదు. ఎక్కడ చూచినా రోగాలు: ఆహార లోపంవల్లవచ్చే రోగాలూ, అనారోగ్య కరమైన నివాసాలవల్లవచ్చే రోగాలూ. ఎక్కడ జూచినా దారిద్ర్యం: పురాణ కాలంనాటి పనిముట్లతో కడుపు నిండని జీతాలతో పనిజేసే ప్రజలు - రేపటి అవసరాలకు మిగుల్చుకోడానికిగానీ, ఈ నాటి అవసరాలను తీర్చుకోటానికిగానీ డబ్బులేని ప్రజలు.

ఇటువంటి దేశాన్ని పునర్నిర్మించాలంటే, దానిని ఒక స్వతంత్ర జాతిగాజేసి ప్రజలకు మామూలు జీవిత సౌఖ్యాలు లభించేటట్లు చేయాలంటే, ఎంతో సాహసము కావాలి.

అదృష్టవశాత్తు ఈజిప్టు ప్రభుత్వం అసహాయంగాలేదు. సాంకేతిక సహాయ సంస్థయొక్క విజ్ఞాన నిధినుంచి వాడు కావలసినంత సహాయం పొందవచ్చు. ఈజిప్టుకు సలహాలు, సహాయము అందివ్వటానికి 1953లో ఈ సంస్థనుండి 43 మంది నిపుణులు పంపబడినారు. 1954లో 80 మంది పోయేటందుకు ఏర్పాటైంది. ఈజిప్టియనులు విదేశాలలో విద్యాభ్యాసము చేయు టానికి ఉచిత వేతనాలు యివ్వటానికి నిర్ణయమైంది.

ఈ నిపుణులు అనేక భిన్నరంగాలలో కృషిచేస్తున్నారు. వారు పంటలనూ పశుసంపదనూ ఎక్కువ చేయడానికి కృషి

చేస్తున్నారు. ప్రజారోగ్యశాఖ సిబ్బందికి శిక్షణ యివ్వటంలోనూ, మంచి అహారము ఎన్నుకోవడం, వండుకోవడం ప్రయోగ పూర్వకంగా ప్రజలకు చూపడంలోనూ కృషిచేస్తున్నారు. జాతీయాదాయ లెక్కలను గురించి ప్రభుత్వానికి వారు సలహాలూ యిస్తున్నారు. కార్మికులకు సాంఘిక భీమా సౌకర్యాలు కల్పించడానికి అవకాశాలనూ పరిశీలిస్తున్నారు.

ఈజిప్టు కోరికపై అనేక దేశాల నిపుణులను ఐక్యరాజ్య సమితి పంపింది. వారు అనేక రంగాలలో పనిచేస్తున్నారు. కానీ నేత్రరోగాలూ, అంధత్వం వీటిని గురించి వారు చేసేపని ప్రత్యేకంగా పేర్కొన దగింది.

గ్రుడ్డితనమూ, కంటి రోగాలూ పూర్వము నుండి ఈజిప్టు ప్రజలను పీడిస్తున్నవి. కాని యిప్పుడు డాక్టర్లు ట్రకోమానూ, కండ్లకువచ్చు యితర అంటు వ్యాధులనూ, నివారించడం తెలుసుకొన్నారు. గ్రుడ్డివారికి స్వతంత్రంగా, స్వయం పోషకంగా బ్రతకడం నేర్పటంలో గూడా ఎంతో అభివృద్ధి సాధింప బడింది. కంటి రోగాలకు, ముఖ్యంగా చిన్నపిల్లలకు, చికిత్స చేయటానికి ఒక అసుపత్రీ, గ్రుడ్డివాళ్ళకు స్వతంత్రంగా బ్రతకటం నేర్పించే ఒక పాఠశాలా ఇప్పుడు ఈజిప్టులో ఉన్నాయి. ఇక మీదట అంధత్వము అంత భయంకరంగా ఉండదు.

దువేల యేండ్లనాడు ఈజిప్టులో "ఫారో"లనబడే రాజులు

గొప్ప గొప్ప పనులుచేసి తమ ప్రజలను చూరగొన్నారు. నాల్గవ వంశంలోని ఖాఫ్రీ అనే రాజు తన విగ్రహమును బ్రహ్మాండమైన రాతిలో స్త్రీ ముఖముగల సింహాకారముగా చెక్కించెను. దీని దేహముయొక్క పొడవు 187 అడుగులు, శిరస్సు 66 అడుగుల ఎత్తు. ఖాఫ్రీ, ఖుఫ్రూ రాజుల సమాధులు అనేక సంవత్సరాల తరబడి కట్టబడిన గొప్ప నిర్మాణాలు. అవేపిరమిడ్‌లు. మూడవ "అమెన్ హాటెప్"అను రాజు అమాన్ అను దేవునికి లక్సర్ దగ్గర కట్టించిన ఆలయం ఎంత పెద్దదంటే అతని సర్వైశ్వర్యమూ, బానిసలందరినీ వినియోగించినా ఆ ఆలయం పూర్తి కాలేదు.

అనేక శతాబ్దాలు ఈజిప్టును పీడించిన దారిద్ర్యాన్నీ, దైన్యాన్నీ చీల్చుకొని ఒక నూతన జాతిని సృష్టించడం, పూర్వపు రాజులు సాధించిన నిర్మాణ కార్యాలకంటే మహత్తరమైనది. ఐక్యరాజ్య సమితి సహాయం లేనియెడల ఈజిప్టు దేశనాయకులు దీనిని సాధించి యుండలేరు.



# 10. లిబియాకు ఒక ప్రభుత్వం.

ఉత్తర ఆఫ్రికాలో ఒక క్రొత్త జాతి, అన్నిటికంటే క్రొత్త జాతి, లిబియా. 1952 లోనే పుట్టింది అది. దానికి ప్రభుత్వం నిర్వహించటంలో సహాయం కావాలి.

గ్రీస్, ఇటలీల కెదురుగా మధ్యధరా సముద్ర తీరంలో వెయ్యిమైళ్లు పొడవున్న గొప్ప యెడారి దేశం లిబియా. ఎన్నో శతాబ్దాలు అది యితరుల అధికారం క్రిందవుంది. అందుచే స్వతంత్ర దేశంగా బ్రతికే యోగ్యత దానికి లేదని చాలా మంది అన్నారు.

దానిని పూర్వము నుండి గ్రీకులూ, కార్థేజీనియనులూ, రోమనులూ, అరబ్బులూ, టర్కీదేశీయులూ పాలించినారు. 20 వ శతాబ్దంలో ఇటాలియనులు పాలించినారు. గ్రీకులక్రిందా, రోమనులక్రిందా ఉన్నప్పుడు అది సంపన్నదేశం. పండ్లతోటలూ, పచ్చని పొలాలూ, ద్రాక్షతోటలూ, ఆలీవ్‌తోపులూ వీటిలో పండే ఆహార పదార్థాలు, మధ్యధరా సముద్రంద్వారా యూరప్‌లోని దాని ప్రభువులకు రవాణా అవుతుండేవి. తరువాత ప్రజల అశ్రద్ధవలన ద్రాక్షతోటలు పాడైనాయి. బావులూ, చెరువులూ యెండిపోయినాయి. అడవులలోని చెట్లన్నీ కొట్టివేయ బడినాయి. తరువాత

సహారా యెడారిలోని యిసుక గాలికి కొట్టుకవచ్చి పొలాలను కప్పి వేసింది. దేశమంతా బీడుగా మారింది.

1930 తరువాత లిబియాకు పూర్వ సౌభాగ్యాన్ని కూర్చ డానికి ముసోలినీ ప్రయత్నించినాడు. ఆతడు రోడ్లకూ పబ్లిక్ భవనాలకూ, పెద్ద పెద్ద మొత్తాలను ఖర్చుపెట్టి, లిబియాకు వలస పోవుటకు ఇటాలియనులను ప్రోత్సహించినాడు. కాని ముసోలినీ అంచనాలు తలక్రిందై రెండవ ప్రపంచ యుద్ధంలో లిబియా ఒక పీనుగుల పెంటైంది.

యుద్ధం ఐపోయిన తరువాత లిబియాను యేమిచేయాలి అనే సమస్యమీద మిత్రరాజ్యాలకు ఐకమత్యము కుదరలేదు. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, సోవియట్ రష్యా, ఈ నాలుగు అగ్ర రాజ్యాలు కలిసి ఎంత చర్చించినా ఈ ప్రశ్నకు సమాధానం దొరకలేదు.

లిబియాను ఎట్లు పాలించాలి? దానిని అనేక భాగాల రాజ్యాలుగా విభజింపవలెనా లేక ఒకటిగానే ఉంచవలెనా? దానికి ఎట్టి అధికారాన్ని (ప్రతిపత్తి) యివ్వాలి? ఇవీ ప్రశ్నలు.

ఎన్ని దీర్ఘమైన వాదోపవాదాలూ చర్చలూ చేసినా ఈ ప్రశ్న లకు జవాబులు దొరకలేదు. మిత్రరాజ్య నాయకులకు యుద్ధ మంటే విసుగెత్తింది. శాంతియుతంగా బ్రతకాలని తహ తహ

పడుతున్నారు. యుద్ధాలనూ, యుద్ధభీభత్సాలనూ మరచి పోవ డానికి ప్రయత్నిస్తున్నారు. అందువలన ఒక క్రొత్త వలస రాజ్యాన్ని నెత్తిమీద పెట్టుకోడానికి ఎవరికీ యిష్టంలేదు. లిబియాలో నానా జాతులవారున్నారు. ఇటాలియనులూ, అరబ్బులూ, బర్బరులూ, నీగ్రోలూ, యూదులూ, వీరందరూ తెలివి పరులూ, కష్టపడి పనిజేసే వారూ. ఐనా ఒయాసిస్సులలో ఖర్జూరాలూ, నారింజలూ, ఎంత బాగా పండినా, యిసుక యెడారులూ, ఒంటెల మీద ప్రయాణజీవులూగల లిబియా మీద పెత్తనం వహించడానికి ఎవరికీ యిష్టంలేదు.

అగ్రరాజ్య చతుష్టయం ఈ విధంగా చర్చలు సాగించే టప్పుడే లిబియా ప్రజలలోగూడ చర్చలు బయలు దేరినాయి. ఎత్తైన సన్నని గోపురాలుగల తెల్లని ట్రిపోలీ నగరంలోనూ, సముద్ర తీరంలోని ఉజ్జ్వల సూర్యాతపములోనూ, వసారాలలోని శీతల చ్ఛాయలలోనూ, శతాధిక గవాక్షాలవెనుకా, రాత్రివేళల యెడారి యాత్రీకులు సేదదీర్చుకొనే గుడారాలలోనూ, అన్నిచోట్లా, దేశం నలుమూలలలా ఒకటే చర్చ. "మనకు పరరాజులెందుకు? మనం స్వతంత్రంగా యెందుకుండలేము? వందల యేండ్ల నుండీ యితరుల చెత్రిక్రింద వున్నాం; ఇప్పుడైనా మన రాజ్యం మనం చూసుకోలేమా?" అని ప్రజలందరి చర్చ.

**1949** నవంబర్‌లో లిబియా ప్రభుత్వ సమస్య ఐక్యరాజ్య సమితిలో చర్చకు వచ్చింది. రెండేండ్ల తరువాత లిబియాకు

స్వాతంత్ర్య మివ్వాలని జనరల్ అసెంబ్లీ తీర్మానించింది. 1952 సంవత్సరము జనవరినుండి అది స్వతంత్ర రాజ్యంగా ఉండే టట్లు ఏర్పాటైంది.

విదేశ ప్రభువుల అశ్రద్ధవల్లా, అత్యాశవల్లా దేశంలో ఐశ్వ ర్యమంటూ యేమీలేదు. ఐనా ప్రజలలో ధీశక్తీ, దేహశక్తీ, ఇంకా ఉన్నాయి. ఈ సంపదను సద్వినియోగం చేసుకోవచ్చు. దేశంలో సుమారు పండ్రెండున్నర లక్షల మంది ప్రజలున్నారు. అందులో కొందరు ట్రిపోలీ, బెంఘాజీల లాంటి నగరాలలో నున్నారు. ఈ నగరాలలో కోట గోడలవరకూ మిద్దెలుంటాయి. నగర మధ్య లోబయలు జాగాలో మార్కెట్ వుంటుంది. అక్కడ పల్లెల నుండీ ప్రజలు తెచ్చిన సరుకులూ, పట్టణంలోని వర్తకుల వస్తు వులూ అమ్మకమౌతాయి. పాముల వాళ్ళతోనూ, కథలు చెప్పే వాళ్ళతోనూ, గారడి వాళ్ళతోనూ, నాట్యంచేసే బాలురతోనూ, పిల్లనగ్రోవి పాటగాళ్ళతోనూ, మార్కెట్ కోలాహలంగా ఉంటుంది.

ఈ నగరాలలో నిత్య దరిద్రులు నివసించే యిరుకు కొం పలుగల సందులూ, గొందులూ వున్నాయి. జలయంత్రాలూ, విక సిత పుష్పాలూగల ఉద్యాన వనాలలో విరాజిల్లే విశాల సౌధాలూ వున్నాయి.

రోజుకు ఐదు సార్లు భక్తులను ప్రార్థనలకు పిలిచే మౌల్వీ లతో సన్నని గోపురాలుగల మసీదులూ వున్నాయి ఈ నగరాలలో.

ప్రజలలో కొద్దిమంది మాత్రమే ఈ నగరాలలో నివసిస్తుంటారు. అనేకులు పల్లెలలో నివసిస్తూ నిస్సారమైన భూమితో తంటాలు పడుతూ వుంటారు. మరికొందరు యెడారిలో అక్కడక్కడనున్న ఓయసెసెలలో ఆలీవ్, ఖర్జూరాలూ పండించి బ్రతుకు తుంటారు. ఇంకా పాతికభాగం ప్రజలకు నివాస స్థలమే లేదు, వారు యెప్పుడూ ఒంటెల మీద యెడారిలో వెనుకకూ, ముందుకూ ప్రయాణాలు చేస్తూనే వుంటారు.

లిబియాలో ఇటాలియనులూ, అరబ్బులూ, బర్బరులూ, నీగ్రోలూ, యూదులూ ఉన్నారు. ఇట్లు అనేక జాతులున్నా, వారి జీవిత పద్ధతు లనేకమున్నా, వారికి అనేక వృత్తులలో నైపుణ్యమూ, అనేక విద్యలలో ప్రావీణ్యమూ ఉన్నది. వారిలో కమ్మరులూ, కుమ్మరులూ, బట్టలు నేసేవారూ, రంగులు అద్దేవారూ, స్వర్ణకారులూ, లోహకారులూ, చర్మకారులూ, వడ్రంగులూ ఉన్నారు. వారిలో అత్యధికంగా దైవభక్తిగల మహమ్మదీయులు. నూటికి పదిమంది మాత్రమే చదువుకున్నవారు.

ఈ స్థితిలోని ప్రజలకు 1952 సం॥ జనవరి ఒకటవ తేదీన స్వతంత్ర ప్రభుత్వం యేర్పాటు చేసుకోవటం అసాధ్యమైన పనే. వారికి యితరుల సహాయం కావలసి వచ్చింది.

ఇంతకు ముందు ఏ ప్రభుత్వమూ లేనిచోట ఒక క్రొత్త ప్రభుత్వం ఏర్పాటు చేయాలంటే ఎన్నో సమస్యలను ఎదుర్కో

వాలి. క్రొత్త నాణ్యాలనూ, నోట్లనూ – విదేశ ప్రభుత్వ ముద్ర లేకుండా, ఆ ప్రభుత్వ ముద్రగల వాటిని ముద్రించాలి. ప్రజల స్థితిగతులకు అనుగుణంగా శాసనాలను తయారు జేసుకోవాలి. తరువాత దేశంలోని వివిధ ప్రాంతాలకు పరస్పర సంబంధాలు ఉండేటట్లు రహదారులు నిర్మించుకోవాలి. లోటు బడ్జెట్‌తో నడిచే దేశానికి ఇన్నిపనులు చేయటానికి డబ్బు ఎక్కడుంటుంది? ఏదో ఒక సంపన్న దేశం సహాయం చేయకపోతే ఈ పనులన్నీ ఎట్లు నెర వేరుతాయి?

ఐక్యరాజ్య సమితి నిపుణుల కార్యభారం ఇదే – లిబి యాలో ఎటువంటి ప్రభుత్వముంటే సంపన్న దేశాలవారు అప్పు యివ్వటానికి సిద్ధపడుతారో అటువంటి స్థిరమైన ప్రభుత్వాన్ని స్థాపించటానికి సహాయపడటం.

ఈ కార్యక్రమానికి మొట్టమొదటి ఆటంకం ప్రజలకు చదువు రాకపోవటం. రికార్డులూ, జమా, ఖర్చులూ వ్రాయకుండా సక్రమ ప్రభుత్వాన్ని ఎట్లా స్థాపిస్తారు? గుమాస్తాలు, టైపిస్టులు, అక్షరశుద్ధైనా చదువగల పోస్టు జవాన్లు ఎంతోమంది కావాలి. అందుకని ట్రిపోలీ నగరంలో ఒక సాంకేతిక శిక్షణ కేంద్రం వెంటనే నెలకొల్ప బడింది. దీనికి ఇంగ్లాండూ ఫ్రాన్సూ సహాయ పడినారు. ఒక ఆంగ్లేయ నిపుణుడు ఒక ప్రాథమిక పాఠశాల మొదలు పెట్టినాడు. వ్యాపార లేఖారచనా, వ్యాపార పద్ధతులూ, ఇంగ్లీషు అరేబియన్ భాషల్లో టైపింగూ, విదేశ భాషలూ నేర్పించే

మరొక పాఠశాల ప్రారంభింప బడింది. ప్రాథమిక ఉపాధ్యాయులను తర్ఫీదు చేయటానికి పాఠశాలనుగూడా లిబియాలో ప్రారంభిస్తున్నారు.

అనేక శతాబ్దాలుగా గ్రీకులూ, రోమనులూ, కార్తేజీనియనులూ, అరబ్బులూ, ఇటాలియనులూ, లిబియాను దోచుకున్నారు. అనేక సంవత్సరాలుగా వీరందరూ లిబియాలోని భౌతిక సంపదలను కొల్లగొట్టినారు. ప్రపంచ చరిత్రలో మొదటసారిగా ఇప్పుడు ఒక మార్పు వచ్చింది. వారి వ్యవహారాలను వారే చక్కబెట్టుకొనే మార్గాన్ని లిబియనులకు ఐక్యరాజ్యసమితి నిపుణులు నేర్పుచున్నారు. దీనికి చాలకాలమే పట్టవచ్చు. పొరపాట్లుగూడా జరుగుతాయి. కానీ తమ పొరపాట్లకు తామే కర్తలుగా వుండే స్వాతంత్ర్యము ఈ లిబియనులకున్నది. ఇదీగాక లిబియన్ ప్రజల శక్తిలో ఐ. రా. స. కి విశ్వాస మున్నది గనుకా, పరిపాలనా వ్యవహారాలలో ఐ. రా. స. తోడ్పడగలదు గనుకా, ఈ పరిణామ ఫలితాన్ని ప్రపంచం ఆశతోనూ, ఉత్సాహంతోనూ ఎదురుచూస్తూంది.

---

# 11. రాజాధి రాజు దేశంలో.

భూమధ్యరేఖకు ఐదు అక్షాంశలు ఉత్తరంగా ఆఫ్రికా తూర్పుతీరంలో ఇథియోపియా అనే దేశం వుంది. ప్రపంచంలో చాలమందికి దీని సంగతే తెలియదు. ఇదంటే అందరికీ అల క్ష్యమే. ఈ దేశమంతా కొండల మయమైన మైదానాలు. ఉష్ణ మండలమైనా ఎత్తైన ప్రదేశాలు ఎక్కువగా వున్నందున సమశీతోష్ణ స్థితే చాలా ప్రదేశాలలో వుంటుంది. రెండు ఉన్నత పీఠభూముల మధ్య లోయలో నైలునది – సాధారణ మానవులకు అందుబా టులోలేని నీలవర్ణపు నైలునది ఉద్భవిస్తుంది. టానా సరస్సు తీరంలో ఖడ్గమృగాలూ, అరణ్య ప్రదేశాలలో జింకలూ, చారల గాడిదలూ, సింహాలూ, ఏనుగులూ వుంటాయి. చిరుతపులులూ, నక్కలూ, తోడేళ్ళూ, పాములూ ఎక్కడ బడితే అక్కడే వుం టాయి. పీఠభూమి మీద మైళ్లకొలదీ పచ్చిక మైదానాలున్నాయి. ఇథియోపియాలో ఇటువంటి ప్రదేశమే యెక్కువ. ఈ మైదా నాలలోని మృగాలతో మధ్య ప్రాచ్యానికంతా మాంసం సరఫరా చేయవచ్చు; అన్ని మృగాలున్నాయి యిక్కడ. ఎంతమంది ప్రజల కైనా ఆకలిబాధ తీర్చగల ఆహార సంపద ఉన్నదన్నమాట.

ఇథియోపియనులీ దేశానికి ఎప్పుడు వచ్చిందీ ఎవరికీ తెలియదు. వారెక్కడనుండి వచ్చిందీ వారికే తెలియదు. అయినా

వారిల్లో కొందరు చెప్పేదేమంటే, వారు సెమిటిక్ జాతివారనీ, దక్షిణ అరేబియానుండి ఎర్రసముద్రముదాటి ఈశాన్య ఆఫ్రికా తీరం జయించి ఇథియోపియా పీఠభూమి నాక్రమించినారనీ. వారి మొదటి రాజు క్రీస్తుపూర్వం వెయ్యేండ్లనాడు సాలమన్ రాజుకూ షీబారాణికీ పుట్టినవాడని జనశ్రుతి. అయితే ఇది జన శ్రుతి మాత్రమే.

ఏది ఎట్లైనా వారు నాల్గవ శతాబ్దంలో క్రైస్తవ మతాన్ని స్వీకరించినారనేది యథార్థం. ఎజానాస్ అనే రాజు కాలంలో టైర్ నగరంనుండి ఒక వ్యాపారదళం ఇండియాకు పోతూవుండగా ఎర్రసముద్రంలో వారి ఓడ ప్రమాదవశాత్తు మునిగి పోయింది. చచ్చినవారు చావగా మిగిలినవారిలో ఫ్రూమెంటియస్ అను వాడొక డుండెను. అతడు ఇథియోపియనులతో కలిసి కొన్నేండ్లు ఉండిన తరువాత వారికి క్రైస్తవమతం బోధించటం మొదలు పెట్టినాడు. కాప్టిక్ మత గురువైన "అథనేసియస్" అతని శ్రద్ధా భక్తులకు మెచ్చి అతనిని ఇథియోపియా మతగురువుగా నియమించెను. అందువలననే ఇప్పటికీ చాలమంది ఇథియోపియనులు అలెగ్జాండ్రియా కేంద్రంగాగల కాప్టిక్ క్రైస్తవశాఖకు చెందియున్నారు. ఇంకా చాలమంది మహమ్మదీయులు; కొందరు రోమన్ కాథలిక్ శాఖకు చెందిన వారుకూడ వున్నారు. ఏ మతానికీ చెందకుండా ఆటవిక విశ్వాసాలు గలవారుగూడా కొందరున్నారు.

మతము ఏదైనా ఇథియోపియను లందరికి రాజభక్తి

గాఢంగా ఉండేది. ఆ దేశపు రాజుకు "రాజాధి రాజు" అని బిరుదు. దేశంలోని భూమి అంతా రాజుదే; రాజు ఏక ఛ్ఛత్రాధిపతి. 12 వ శతాబ్దంలో అతని ఐశ్వర్య అధికారాలను గురించిన ప్రశంస దేశ దేశాలకూ వ్యాపించింది. "ప్రెస్టర్‌జాన్" అనే క్రైస్తవ రాజు అనంత ఐశ్వర్యాలకు అధిపతి అనీ, అతని రాజ్యం ఎక్కడుందో తెలియదనీ పోర్చుగీసువారు కథలు చెప్పుకునేవారు "ఆకాశంలోని నక్షత్రాలనూ సముద్రంలోని ఇసుక రేణువులనూ లెక్కించ గలిగితే, అతని రాజ్య విస్తీర్ణాన్నీ, అధికార పరిమాణాన్నీ అంచనా కట్టవచ్చు" అని ఇథియోపియనులు తమ గ్రంథాల్లో వ్రాసుకున్నారు. కాని యెన్ని ప్రయత్నాలు చేసినా యూరోపియనులకు ప్రెస్టర్‌జాన్ ఉనికిపట్టు అర్థం కాలేదు.

చాల యేండ్లు ఇథియోపియాలో నల్లని రాజులు అతి వైభవంగా రాజ్యం చేసినారు. వారి జన్మదినోత్సవాలనాడు ప్రజలందరూ అడిస్ అబాబాలోని రాజ మందిరం వద్దకువచ్చి తమ భక్తి ప్రపత్తులను వెల్లడించేవారు. ఉన్నత వంశస్థులు గాడిదల మీద ఎక్కి తుపాకులు ధరించిన అంగరక్షకులను వెంట బెట్టుకొని వచ్చేవారు. క్రైస్తవ, మహమ్మదీయ మత గురువులకుగూడా గార్దభ వాహనా లుండేవి. కానీ పూరిగుడిసెలలో బ్రతికే సాధారణ ప్రజానీకానికి కాళ్ళకు దుమ్ము పూసుకొనక తప్పేదికాదు.

ఇథియోపియా "రాజాధి రాజు" మహోన్నతమైన వ్యక్తి; అతని ఐశ్వర్యం అనంతం; ప్రజలందరి చావుబ్రతుకులూ అతని

చేతులో ఉన్నవి. అంపడూ అతనికి కానుకలు చెల్లించ వలసించె. ఆ కానుకలు ధన రూపంలోగాదు, పశురూపంలో; ఆ దేశంలో ధనానికి విలువలేదు. అతనికి కోపంవస్తే విదేశీయులందరినీ బహిష్కరింప గలడు. అతనికి అంత అధికారముంది. ఈ విధంగా అనేక శతాబ్దాలు జరిగింది.

ఇంతలో పందొమ్మిదవ శతాబ్దం – యూరోపియన్ సామ్రాజ్యవాదయుగం – వచ్చింది. ఇంగ్లాండు, ఫ్రాన్స్, ఇటలీలు, ఆఫ్రికా ఖండాన్ని భాగాలు పంచుకున్నారు. ఇథియోపియాలో ఎంత ఐశ్వర్యముంచో వారికి తెలియకున్నా ఎంతో కొంత ఉన్నదని వారి నమ్మకం.

సామ్రాజ్యవాద దేశాలకు వారిలో వారికి కీచులాటలు ప్రబలమైనాయి. అందువల్ల ఎవరూ ఇథియోపియాజోలికి రాలేదు. ప్రపంచ చరిత్రలో బహుపురాతనమైన ఈ రాజ్యానికి పరాధీనత ఇంకా ప్రాప్తించలేదు.

**1930**లో రాస్ టఫారి అను నతడు పట్టాభిషిక్తుడై “హెయ్లీ సెలాసు” అను బిరుద నామము వహించినాడు. అతడు ధీమంతుడూ, ప్రజ్ఞావంతుడూ, ఇంగ్లాండులో విద్య నభ్యసించినవాడూ. మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఇటలీకి ఇథియోపియాను కబళించ వలెనసె దీక్ష ఇంకా వుండటం గమనించి “హెయ్లీసెలాసీ” నానా జాతి సమితికి నివేదించు కున్నాడు. కానీ శైశవ దశలోనున్న

సమితి శక్తిలేనిదై ఏమీచర్య తీసుకోలేదు.

1936 మేనెలలో మార్షల్ బడోగ్లియో ఆధిపత్యం క్రింద ఇటాలియన్ సైన్యాలు ఇథియోపియా రాజధాని యైన అడిస్ అబాబాను ఆక్రమించు కున్నాయి. "రాజాధి రాజు" లండన్‌లో తలదాచు కున్నాడు.

ఇథియోపియాను ఆధునికం చేస్తానని ముసోలినీ ఎంతో ఆర్భాటం చేసినాడు. కొన్ని రోడ్లూ కొంత రైల్వేలైనూ నిర్మించి నాడుకూడా. అయినా ఇటలీ ఆధిపత్యం చాలకాలం నిలువ లేదు.

రెండవ ప్రపంచ యుద్ధంలో – 1940 జులైలో ఇథియో పియా తన మిత్ర రాజ్యమని ఇంగ్లాండు ప్రకటించింది. హైల్ సెలాసీ సుడాన్‌నుండి సైన్యాన్ని నడిపించి 1941 మేలో అడిస్ అబాబాను పునరాక్రమించు కొన్నాడు. డ్యూక్ ఆఫ్ అయోస్టా క్రిందనున్న ఇటాలియనులు లొంగిపోయినారు. "రాజాధి రాజు" తిరిగి రాజ్యానికి వచ్చినాడు.

ఆంగ్ల సంప్రదాయాల్లో శిక్షితుడైన హైల్‌సెలాసీ తన దేశాన్ని గురించి చాలా ఆశలు పెట్టుకున్నాడు. అతడు ఒక రాజ్యాంగాన్ని తయారు చేయించినాడు. ఒక ప్రతినిధుల సభనూ ఒక సెనేట్‌నూ ఏర్పాటు చేస్తాననీ, వాటి సభ్యులను ఎన్నుకునే

చేతులో ఉన్నవి. అందరూ అతనికి కానుకలు చెల్లించవలసిందే. ఆ కానుకలు ధన రూపంలోగాదు, పశురూపంలో; ఆ దేశంలో ధనానికి విలువలేదు. అతనికి కోపంవస్తే విదేశీయులందరినీ బహిష్కరింప గలడు. అతనికి అంత అధికారముంది. ఈ విధంగా అనేక శతాబ్దాలు జరిగింది.

ఇంతలో పందొమ్మిదవ శతాబ్దం – యూరోపియన్ సామ్రాజ్యవాదయుగం – వచ్చింది. ఇంగ్లాండు, ఫ్రాన్స్, ఇటలీలు, ఆఫ్రికా ఖండాన్ని భాగాలు పంచుకున్నారు. ఇథియోపియాలో ఎంత ఐశ్వర్యముందో వారికి తెలియకున్నా ఎంతో కొంత ఉన్నదని వారి నమ్మకం.

సామ్రాజ్యవాద దేశాలకు వారిలో వారికి కీచులాటలు ప్రబలమైనాయి. అందువల్ల ఎవరూ ఇథియోపియాజోలికి రాలేదు. ప్రపంచ చరిత్రలో బహుపురాతనమైన ఈ రాజ్యానికి పరాధీనత ఇంకా ప్రాప్తించలేదు.

1930లో రాస్ టఫారి అను నతడు పట్టాభిషిక్తుడై "హెయ్లీ సెలాసీ" అను బిరుద నామము వహించినాడు. అతడు ధీమంతుడూ, ప్రజ్ఞావంతుడూ, ఇంగ్లాండులో విద్య నభ్యసించినవాడూ. మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఇటలీకి ఇథియోపియాను కబళించ వలెననే దీక్ష ఇంకా వుండటం గమనించి "హెయ్లీసెలాసీ" నానా జాతి సమితికి నివేదించు కున్నాడు. కానీ శైశవ దశలోనున్న

సమితి శక్తిలేనిదై ఏమీచర్య తీసుకోలేదు.

1936 మేనెలలో మార్షల్ బడోగ్లియో అధిపత్యం క్రింద ఇటాలియన్ సైన్యాలు ఇథియోపియా రాజధాని యైన అడిస్ అబాబాను ఆక్రమించు కున్నాయి. "రాజాధి రాజు" లండన్‌లో ఆలపాచు కున్నాడు.

ఇథియోపియాను ఆధునికం చేస్తానని ముసోలినీ ఎంతో ఆర్భాటం చేసినాడు. కొన్ని రోడ్లూ కొంత రైల్వేలైనూ నిర్మించి నాడుకూడా. ఆయినా ఇటలీ అధిపత్యం చాలకాలం నిలువ లేదు.

రెండవ ప్రపంచ యుద్ధంలో – 1940 జులైలో ఇథియో పియా తన మిత్ర రాజ్యమని ఇంగ్లాండు ప్రకటించింది. హైల్ సెలాసీ సుడాన్‌నుండి సైన్యాన్ని నడిపించి 1941 మేలో అడిస్ అబాబాను పునరాక్రమించు కొన్నాడు. డ్యూక్ ఆఫ్ అయోస్టా క్రిందనున్న ఇటాలియనులు లొంగిపోయినారు. "రాజాధి రాజు" తిరిగి రాజ్యానికి వచ్చినాడు.

ఆంగ్ల సంప్రదాయాల్లో శిక్షితుడైన హైల్‌సెలాసి తన దేశాన్ని గురించి చాలా ఆశలు పెట్టుకున్నాడు. అతడు ఒక రాజ్యాం గాన్ని తయారు చేయించినాడు. ఒక ప్రతినిధుల సభనూ ఒక సెనేట్‌నూ ఏర్పాటు చేస్తాననీ, వాటి సభ్యులను ఎన్నుకునే

యోగ్యత ప్రజలకు కలిగేటంతవరకూ తానేవారిని – రాజవంశస్థులూ, మంత్రులూ, జడ్జీలూ, ఉన్నత సైనికాధికారులూ – వీరినుండి ఎన్నుకొని నియమిస్తాననీ వాగ్దానం చేసినాడు.

అతడు దేశాన్ని పండ్రెండు రాష్ట్రాలుగా విభజించినాడు. కొన్ని ప్రాథమిక పాఠశాలలు ప్రారంభించినాడు. బానిస పద్ధతిని నిర్మూలించడానికి ప్రయత్నించినాడు.

1942 జనవరి 1 వ తేదీనాడు అతడు శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశంలో ఐక్యరాజ్యాల ప్రకటనలో సంతకంజేసి ఐక్యరాజ్య సమితిలో తన దేశానికి సభ్యత్వం కలిగించినాడు.

ఐక్యరాజ్య సమితి సభ్యరాజ్యంగా సాంకేతిక సహాయ సంస్థకు మొట్టమొదట అర్జీ పెట్టుకొన్నది ఇథియోపియాయే. ఆహార వ్యవసాయసంస్థ అధ్వర్యాన ఒక పశువైద్యదళము ఆ దేశ పరిస్థితులను పరిశీలించడానికి పయనమైంది.

మాంసమూ, తోళ్లూ, చర్మాలూ, సులభంగా ఎగుమతిచేసే సౌకర్యాలు ఇథియోపియా కున్నట్లు కనుపించింది. కాఫీ గింజలు సులభంగా పండించవచ్చు గాబట్టి అవిగూడా కొంతవరకు ఎగుమతి చేయవచ్చు. అట్లు వచ్చిన ఆదాయంతో, పాఠశాలలూ, ఆసుపత్రులూ, ఇతర ప్రజావసర సంస్థలూ పోషించుకోవచ్చు.

దేశంలో ఒక కోటి మొదలు రెండు కోట్లవరకూ పశువు లున్నవి. ఇరుగు పొరుగు దేశాలలో మాంసానికి గిరాకీగూడా వుంది. కానీ మాంసము ఎగుమతి కావడంలేదు. ఈ దుస్థితికి కారణం ఆ దేశంలో వుండే రిండర్ పెస్ట్ అనే పశువుల అంటురోగం.

ఈ వ్యాధిని నివారించే పద్ధతులు ఆధునిక వైద్యులకు తెలుసు. పశువులకు టీకాలువేసి దీనిని అదుపులో పెట్టవచ్చు. కాని ఎవరో తెల్లవాళ్లువచ్చి తమ ఆవులకూ, యెద్దులకూ, సూదులు పొడవటం ఇథియోపియనులకు కంటగింపుగా వుండెది. కాబట్టి వారికి నచ్చజెప్పటానికి కొంత వ్యవధీ, అంతకు మించిన ఓర్పూ కావలసి వచ్చింది.

తుదకు ఈ అనిష్టమైన కార్యానికి కొంతమంది ఒప్పుకొన్నారు. ఈ వార్తవిని చుట్టు పక్కల అనేక మైళ్లనుండి తెల్లని దుస్తులు ధరించిన నల్లని రూపాలుగల ఇథియోపియనులు ఈ టీకాల వ్యవహారమేమిటో చూద్దామని వచ్చినారు.

టీకాల ఫలితం త్వరలోనే కానవచ్చింది. కొద్దిరోజులలో టీకాలు వేసిన పశువులు ఆరోగ్యంగానూ ఉల్లాసంగానూ కనపడి నాయి. పశుపాలకుల కందరికీ టీకాలమీద నమ్మకం కుదిరింది. టీకాల కొరకువారు తమ పశువులను మందలు మందలుగా తోలుకొని రాసాగినారు. ఐక్యరాజ్యాల నిపుణులకు చేతినిండా పని తగిలింది. వారుకూడా దీక్షతో పని చేయసాగినారు.

**1951**లో **361,470** పశువులకు టీకాలు వేసినారు. **1952**లో **587,000** పశువులకు వేసినారు. ఈ రిండర్ పెస్ట్ అనేవ్యాధి ఒక్కటేగాదు వారు నివారించింది. ప్లూరోనిమోనియా, అంత్రాక్స్, బ్లాక్‌లెగ్ అనే యితర అంటు వ్యాధులనుగూడా వారు సాధించినారు.

ఈ టీకాలవార్త విదేశాలలో వ్యాపించిన వెంటనే ఇథియోపియానుండి మాంసం ఖరీదు చేయుటానికి ఆ దేశాల్లో సన్నాహాలు జరిగినాయి. గ్రీసుదేశం, తాను ఇథియోపియానుండి కొనదలచుకొన్న పశుమాంసాన్ని నిల్వచేయుటానికి ఒక పెద్ద శీతలాగారము తయారు చేసుకుంటూ వుంది.

కొంతమంది నిపుణులీవిధంగా టీకాల పనిలో నిమగ్నులైయుండగా మరికొందరు చర్మాలకు కర్రవేయటంలో క్రొత్త పద్ధతులను ప్రజలకు నేర్పుచున్నారు. ఈ పద్ధతుల వలన విలువగల చర్మాలు తయారై ఎగుమతి వ్యాపారం ఎక్కువ లాభదాయకమౌతుంది. కాఫ గింజలు పండించడంలోగూడా ప్రజలు ఆధునిక పద్ధతులు అలవర్చుకొంటున్నారు. ఇథియోపియా ఎగుమతిచేసే ముఖ్యవస్తువులలో కాఫీ రెండవది.

ఈ విధంగా ఇథియోపియాలో ఉభయతారకమైన కృషి జరుగుతూవుంది. అటు యూరప్ మధ్యప్రాచ్య దేశాలలోని క్షుధార్తులకు మేలురకం మాంసాహారం సమృద్ధిగా సమీపంలోనే లభి

స్తూవుంది. ఇటు ఇథియోపియాలో పాఠశాలలూ, ఆసుపత్రులూ రోడ్లూ నిర్మించడానికి కావలసిన ఆదాయం అందుబాటులోకి వచ్చింది. రాజాధిరాజు సహాయార్థం ఐక్యరాజ్య సమితి ఈ కార్యభారం వహించింది.

---

# 12. ఇరాన్‌కు ఆకాశ గమనం.



పర్షియాదేశానికే ఇరాన్ అనేదీ క్రొత్తపేరు. పర్షియా అంటూనే ఒక్కొక్కరికి ఒక్కొక్క చిత్రం మనోనేత్రం ముందు మసలుతుంది. పర్షియా అంటే, కొంతమందికి శీతల వృక్షచ్ఛాయలక్రింద పారే నీటికాల్వలూ, చుట్టూ వ్యాపించిన గులాబీ తోటలూ జ్ఞాపకం వస్తాయి. కోమలమైన చిత్తరువులూ, ఉమర్ ఖయాం కవిత్వమూ కొంతమందికి స్మృతిపథంలో మెదుస్తాయి. నీలవర్ణపు గుమ్మటాలు గల మసీదులూ, వాటి గోపురాలలోనిలబడి భక్తులను దైవ ప్రార్థనలకు ఆహ్వానించే మతగురువులూ మనసుకు వస్తారు మరికొంతమందికి. ఎఱ్ఱటి ఎండలో జనాకీర్ణమైన బజారులలో నాట్యమాడే దర్వేషులు కొందరికి గుర్తుకువస్తారు. చిత్రవర్ణశోభితమైన శాలువలు యెదుట నిలుస్తాయి మరికొందరికి. విలువగల మోటారుకార్లూ, అధునాతన పారిస్ నాగరికతా మూర్తులైన మదవతులూ విహరించే టెహరాన్ నగరమే పర్షియా అనుకుంటారు కొందరు మరికొందరు పర్షియా సంధుశాఖ సమీపంలో పాశ్చాత్యదేశాల ధనంతో నిర్మింపబడిన నూనె కేంద్రం అబడాన్ నగరమే పర్షియా అనుకుంటారు.

ఇవన్నీ ఇరాన్‌లో ఉన్నమాట నిజమే; కాని వీటికీ ఇరాన్ ప్రజలకూ ఏమీ సంబంధంలేదు. ప్రజలలో అత్యధికభాగం

రైతులు. రైతులందరూ అమిత దరిద్రులు.

అటు టర్కీ ఇరాక్ దేశాలనుండి ఇటు ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ దేశాలవరకూ వ్యాపించిన ఈ దేశంలో ఉత్తరమునా పశ్చిమమునా ఎల్బ్రజ్, జాగ్రోస్ అను పర్వతాలున్నవి. తక్కిన దేశమంతా పెద్దమైదానం. మధ్యలో కొంత ఎడారి వుంది. ప్రజలలో అత్యధికభాగం ఈ యెడారి అంచుల్లో పర్వతాల దిగువ భాగాన వున్నారు. ఎందుకనగా ఈ ప్రాంతాలలోనే నీరు దొరికే అవకాశాలున్నవి. వసంతకాలంలో పర్వతాలమీద మంచు కరిగి సెలయేళ్ళు పారుతాయి. తక్కిన ప్రాంతాలలో నీరు దొరకటం చాలా కష్టం. ఇరాన్‌లో నదులు చాలా తక్కువ. నౌకా యోగ్యమైనది కరున్ అనేది ఒక్కటే; ఇది దక్షిణ మైదానంలో ప్రవహించి పర్షియన్ సింధుశాఖలో కలుస్తుది.

ఇది బహు పురాతనమైనదేశం. ఎన్నితరాలు గడచినా దీనిలో ఏమీ మార్పురాలేదు. ఎన్నో శతాబ్దాలకు పూర్వం పర్షియా రాజులు పాశ్చాత్య ప్రపంచాన్ని జయించడానికి ప్రయత్నం చేసినారు. కాని మరాథాన్, సలామిస్‌లవద్ద పరాజితులై స్వదేశం చేరుకున్నారు. తరువాత పర్షియారాజులెవరూ విదేశ దండయాత్ర మాట యెత్తుకోలేదు. ఆ పూర్వరాజుల వైభవం క్రమక్రమంగా మందగించింది.

కాస్పియన్ సముద్రానికి ఆగ్నేయ దిశలో పర్వతాలలో

వుండే పార్థియన్ జాతివారు పర్షియా దేశాన్ని "వైభవోన్నతుల దేశం" అని అనేవారు. ఎందుకు అట్లు అనేవారో ఎవరికీ తెలియదు. నిజానికి పర్షియా బీదరైతులదేశం. రైతులు కొండచరియల్లో గోధుమ మొదలైన పంటలు పండించుకుంటూ వేసవిలో లోయల్లోని పచ్చి గడ్డి ఎండిపోతే తమ గొర్రెలనూ, మేకలనూ కొండల ఎగువ భాగానికి తోలుకపోయి మేపుకుంటారు.

ఇరానియనులు కర్షకులైనవారు తమ పొలాల్లో ఇండ్లు కట్టుకోరు. పండేభూమిలో ఇల్లు కట్టడం నష్టంగాదా అంటారు వారు. అందుకనివారు తమ పొలాలకు మైలు రెండుమైళ్ళ దూరంలో గ్రామాలు నిర్మించుకొని నడచిగానీ గాడిదలమీదగాని వస్తూపోతూ వుంటారు.

గ్రామాలలో గృహాలన్నిటికి ఇటుక గోడలో మట్టిగోడలో వుంటాయి. గడ్డికప్పు వుంటుంది. గృహమంటే ఒకటేగది. ఆ గదిలోనే వండు కోవటం, పండు కోవటం, తిరగటం, తినటం. ఆరోగ్య సౌకర్యాలులేవు; ఎవరికీ ఏకాంతమనేదిలేదు. గ్రామానికీ, గ్రామానికీ రహదారిలేదు. పరస్పరవార్తలు తెలుసుకోవడానికి వార్తా పత్రికలులేవు; టెలిఫోనులపేరే యెవరికీ తెలియదు.

గ్రామంలో తిరిగేవారికి ఎప్పుడూ మగ్గాల చప్పుడు వినబడుతూ వుంటుంది — ప్రసిద్ధమైన పర్షియా కంబళ్ళునేసే చప్పుడు. దాదాపు ప్రతిగుడిసెలోనూ స్త్రీలూ పిల్లలూ కంబళ్లు తయారు

చేస్తూ వుంటారు, ఓర్పుతో చాకచక్యంతో ఎడతెగనిముళ్ళు వేసుకుంటూ. తండ్రి తాతలనుండీ నేర్చుకొన్న సమూనాలను మెత్తని మనోహరమైన రంగులతో నేస్తూవుంటారు. ఒక్కొక్కసారి ఒక కంబళి తయారుకావటానికి సంవత్సరంకూడా పట్టుతుంది. తరువాత దాన్ని ఒంటెమీదనో, గాడిదమీదనో తీసుకపోయి, కెర్మాల్‌లోనో, హామదాన్‌లోనో లేకపోతే షిరాజ్‌లోనో, ట్రబీజ్ లోనో అమ్ముకుంటారు. పగలు పురుషులెవరూ సాధారణంగా గ్రామంలో వుండరు; పొలాల్లో వుంటారు. కృతయుగంనాటి అస్తవ్యస్తపు నాగళ్ళను యెద్దులకో, గాడిదలకో కట్టి ప్రొద్దున నుంచి రాత్రివరకూ పొలం దున్నుతూ వుంటారు. పైరు కోతకు వచ్చినప్పుడు కొడవళ్లతో కోత కోస్తారు. కోసిన గడ్డిని గాడిదలతోనో యెద్దులతోనో త్రొక్కించి గింజలు తయారుచేస్తారు.

ఈ వ్యవసాయపద్ధతి చాలా శ్రమతో కూడుకున్నది. దాదాపు భూమిఅంతా కొద్దిమంది ధనికులది. అందువలన రైతులు భూమిని కౌలుకు సాగుచేస్తారు. వారికివచ్చే ఆదాయం బహుస్వల్పం, అదీగాక జలాధారాలు చాలాతక్కువ. కాబట్టి ఏమి పండించాలన్నా కష్టమే. కొన్నిచోట్ల నీరు చాలా మితంగా వుంటుంది కాబట్టి ఉన్ననీటిని పంపకాలు బెట్టటానికి ఒక "నీరు గట్టుమనిషి" ఉంటాడు. వానిపైన "నెరసిన గడ్డాలసంఘం" గ్రామపెద్దల సంఘం వుంటుంది.

కొండలమీదనుండి పారే సెలయేటినీటిని భూగర్భంలో

తీసుకపోయేందుకు ఒక ప్రజ్ఞావంతమైన పురాతన పద్ధతివుంది. పొలాల్లో పెద్ద గుండ్రని గుంటలు త్రవ్వుతారు. ఈ గుంటలను "గనట్" లంటారు. భూగర్భంలో త్రవ్వబడిన పెద్ద సొరంగాల ద్వారా ఈ గుంతలలోకి నీళ్ళు వస్తాయి. కొన్నిచోట్ల ఈసొరంగాలు 20 మైళ్ళ పొడవుగూడా వుంటాయి. 5 వేల సంవత్సరాలనుండీ ఈపద్ధతి సాగుతూ వుందని ప్రజలు చెప్పుతుంటారు. ఈ సొరంగాలలో దిక్కులు తెలిసేటందుకు వారు సూదంటురాతి దిక్సూచిని ఉపయోగించేవారు. అప్పటికింకా దిక్సూచిని గురించి యూరప్‌లోగాని, చైనాలోగాని ఆలోచనేలేదు.

ఈ విధంగా పాత ఆచారలలో పాత పద్ధతులతో, పాత సౌందర్యంతో, పాత దారిద్రంతో అనేకశతాబ్దాలు దొర్లిపోయినాయి. 20 వ శతాబ్దిలో, ఏదేశమైనా ఎన్ని పర్వత ప్రాకారాలున్నా, ఏకాంతంగా బ్రతుకలేనికాలంలో పర్షియాలో మార్పులు మొదలైనాయి. 1906లో ఇంగ్లాడులో మాదిరి శాసనబద్ధమైన రాచరికం నెలకొల్పబడింది. అదేసమయంలో ఎల్బర్జ్‌పర్వతాలమీదుగా రష్యనులు పర్షియాలో ప్రవేశించడం ఆరంభించినారు. పర్షియాలో అశేషమైన ఐశ్వర్యముున్నదని పసిగట్టిన ఇంగ్లాండు, రష్యాలు, పర్షియాను రెండుభాగాలుచేసి చెరియొక్క "అధీన ప్రదేశం"గా ఒప్పందం చేసుకున్నారు.

1908 లో బ్రిటీషు అధీన ప్రదేశంలో నూనెగనులు కనుగొబడినాయి. 1911 నాటికి బ్రిటన్ ఒకపైపులైను (గొట్టాలసముదాయం)

నిర్మించి పర్షియన్ సింధుశాఖ తీరంలో అబడాన్ పట్టణాన్ని కట్టించటం ఆరంభించింది.

ఇరాన్‌లో నూనె దొరకడంతో బ్రిటన్ ఉత్సాహ పూరిత మైంది. పర్షియాదేశం ఒక నూనె సముద్రంమీద తేలుతూ వుందని బ్రిటిష్ ఇంజనీర్లు అభిప్రాయపడినారు. ఇరవయ్యో శతాబ్దపు నవ్య ప్రపంచంలో నూనె అతి అమూల్యమైన సంపద. కాని ఇంతలో **1925**లో రెజాఖాన్ పర్షియాకు రాజు కావడంతో పర్ష్యా నూనెను దోచుకోవడంలో బ్రిటన్‌కు చిక్కులు బయలుదేరినాయి.

ఎవరీ రెజాఖాన్? ఏమో! రాజ్యానికి రాకముందు అతనెవరో సరిగా తెలియదు.

విద్యావంతులు తక్కువగావున్న దేశంలో ఎవరి పుట్టు పూర్వోత్తరాలైనా పత్రికలకూ పుస్తకాలకూ ఎక్కే అవకాశాలుండవు. రెజాఖాన్ మొదట పర్షియా సైన్యంలో కోశాక్ దళంలోవుండి, త్వరలోనే సైన్యాధ్యక్షుడైనట్లు తెలుస్తూవుంది. అతడు సుందర విగ్రహుడనీ, దర్పముగలవాడనీ, తాను సృష్టింపదలచే నూతన జాతికోసం దేనినైనా ఎవరినైనా బలిపెట్టేవాడనీ ప్రజలు చెప్పుకుంటారు.

**1919** లో, కొన్నివేలమంది అనుయాయులతో అతడు పర్షియా ముఖ్యపట్టణమైన టెహరాన్‌మీద దాడిజేసి ప్రభుత్వోద్యో

గుల సంపదనీ బంధించి తానే ప్రధాన మంత్రి యైనాడు. 1925లో అతడే పర్షియాకు రాజుగా ఎన్నికైనాడు.

రెజాఖాన్‌కు పర్షియాను "ఆధునిక" దేశంగా తయారు జేయాలనే వాంఛ గాఢంగా వుండేది. తన ఆశయ సాధనకు ఎవరు అడ్డంవచ్చినా సహించేవాడుగాదు. ఆధునిక జాతుల చరిత్ర అతనికి అంతగా అర్థం అయినట్లు కనబడదు. అతడు తన దేశందాటి ఎన్నడూ బయటకు పోయినట్లుగూడా లేదు. ఐనప్పటికీ దీక్షా, ఉత్సాహమూ ఉన్నందువలన కొన్ని తరాలలో క్రమక్రమంగా రావలసిన మార్పులను కొన్ని యేండ్లలోనే సాధించడానికి ప్రయత్నించినాడు.

మొట్టమొదట తన దేశానికి "పర్షియా" అనేపేరు తీసేసి ఇరాన్ అని పెట్టినాడు. నిజానికి ఇరాన్ అనేది గూడా పాతపేరే. పర్షియా అనేది పూర్వం ఆ దేశంలో ఒక చిన్న రాష్ట్రానికి పేరు. కానీ "రోం" నగర ప్రభావం ఒకప్పుడు ఇటలీ అంతా వ్యాపించినట్లు, ఆరాష్ట్ర ప్రభావం ఆ దేశాన్నంతా ఆక్రమించుకొని వుండేది. ఇరాన్ అంటే ఆర్యభూమి అని అర్థం. పేరుమారుస్తే ప్రజలకు క్రొత్త ఉత్సాహం కలుగుతుందని రెజాఖాన్ యెంచినాడేమో.

తన అధికారాన్ని సుస్థిరం చేసుకోడానికి అతడు సైన్యాన్ని అధికం చేసినాడు. ప్రభుత్వ యంత్రాంగాన్ని సంస్కరించినాడు.

ముస్లిం మతగురువుల అధికారాన్ని అంతమొందించేవాడే గానీ ప్రజలలో వారికుండే అపారమైన పలుకుబడివల్ల వీలు చిక్కింది గాదు. పాఠశాలలు నెలకొల్పి ప్రజలకు పాశ్చాత్య పద్ధతులలో విద్య చెప్పించడానికి అతడు ప్రయత్నించినాడు. ప్రజలంటే సగంమంది స్త్రీలుగదా! అందుకని స్త్రీలుగూడా చదువుకోవాలని శాసించినాడు. స్త్రీల పురోభివృద్ధికి చిహ్నంగా ఒక ఉత్తరువు చేసినాడు: స్త్రీలు "పరదాలు" (ముసుగులు) వేసుకోరాదని. ఆ సూచనే అప్పటికి ఒక ప్రచండమైన విప్లవం.

తరువాత రెజాఖాన్ ఆర్థిక రంగంవైపు దృష్టి మరల్చినాడు. పాశ్చాత్య దేశాలమాదిరి ఇరాన్ సంపన్నమయం కావాలంటే పరిశ్రమలు విరివిగా స్థాపించవలెను. కాని పరిశ్రమలు ప్రారంభించడానికి పెట్టుబడి పెట్టగల ధనికులు చాలా స్వల్పం. అందుకు ప్రభుత్వ ధనం వినియోగించడం తప్ప వేరే మార్గంలేదు.

ఒక నూలు బట్టలమిల్లు, ఒక ఉన్ని బట్టలమిల్లూ, ఒక చక్కెరమిల్లూ అన్నీ ప్రభుత్వాధీనం క్రింద రెజాఖాన్ వెంటనే ప్రారంభించినాడు. ఒక అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ, సబ్బులూ, గ్లిజరిన్ తయారుజేసే ఫ్యాక్టరీ ఒకటి, తోళ్ళ ఫ్యాక్టరీ ఒకటీ, సిమెంటూ, గాజుసామాను ఉత్పత్తిజేసే ఫ్యాక్టరీ ఒకటి, వీటికి గూడా ప్రభుత్వ ధనమే వినియోగింపబడింది. ఇతర చిన్న చిన్న పరిశ్రమలకు ప్రజలు పెట్టుబడి పెట్టడానికి ప్రోత్సాహమివ్వబడింది.

ఇంతలో రెజాఖాన్‌కు ఒక విషయం తెలిసివచ్చింది: ఫ్యాక్టరీలకు ముడి సరుకులు చేర్చడానికీ, ఫ్యాక్టరీలలో ఉత్పత్తి ఐన వస్తువులను దేశమంతటా సరఫరా చేయడానికీ రవాణా సౌకర్యాలు లేనిదే పరిశ్రమలు సక్రమంగా పని చేయలేవని – ఇరాన్‌కు ఒక రైల్వేసంస్థ అత్యవసరం అని.

రష్యా ఇంగ్లాండులు రెండూ ఈ రైల్వే కార్యక్రమంపట్ల ఉత్సాహాన్ని చూపించినాయి. ఉభయదేశాలూ డబ్బుపెట్టడానికి సిద్ధమైనాయి.

స్వాతంత్ర్య ప్రియుడైన రెజాఖాన్ ఎవరి సహాయాన్నీ అంగీకరించకుండా "ట్రాన్స్ ఇరానియన్ రైలురోడ్డు"ను – రష్యా, ఇంగ్లాండుల "అధీన ప్రదేశాలకు" దేనికీ చెందని భాగంలో – నిర్మించినాడు. కానీ 910 మైళ్లు మాత్రమే వున్న ఈ రైల్వే అంత ప్రయోజనకారిగా కనబడలేదు. దేశంలోని ముఖ్యమైన ప్రదేశాలకు ఈ రైల్వే దూరంగానే వుండిపోయింది. ఇరాన్‌కు కావలసింది దేశ వ్యాప్తమైన రహదారుల సముదాయం.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం వరకూ పరిస్థితి ఇట్లా ఉండింది. తర్వాత రాజకీయ వైషమ్యాలు పెరిగి దేశంలో అలజడి ప్రబలమైనందువల్ల రెజాఖాన్ సింహాసనం దిగిపోవలసి వచ్చింది.

అతని తర్వాత అతని కుమారుడు రాజ్యానికి వచ్చి నాడు. కాని వైషమ్యాలు తగ్గలేదు. అలజడి సాగుతూనే ఉంది.

1950 లో ఇరాన్ ఐక్యరాజ్యసమితిలో చేరింది. దాని రవాణా సౌకర్యాల సమస్య సాంకేతిక సహాయసంస్థ యెదుటికి తేబడింది.

వెంటనే ఒక నిపుణులదళం ఇరాన్‌కుపోయి పరిశీలనలు జరిపి ఒక రిపోర్టు సమర్పించినారు. వారిచ్చిన సలహా "ఇరాన్‌లో రైల్వేలు అభివృద్ధి చేయరాదు – కనీసం కొంతకాలం వరకైనా" అని

ఇతర పారిశ్రామికదేశాలు అవలంబించిన మందగమన పద్ధతులు ఇరాన్‌కు ఇప్పుడు లాభదాయకంగావు. ఇతరదేశాలలో పరిశ్రమలు అభివృద్ధిఅయ్యే కొద్దీ రవాణా సౌకర్యాలు అభివృద్ధి అయినాయి. ఆదేశాల్లో మొదట గుర్రపు బండ్లకు కావలసిన రోడ్లు వేసుకొన్నారు; తరువాత రైల్వేలు నిర్మించుకొన్నారు. అపిమ్మట మోటారుబండ్లకు అవసరమైన రోడ్లు వేసుకొన్నారు; అటుతర్వాత విమాన మార్గాలు ఉపయోగంలోనికి వచ్చినాయి. ఇన్ని పరిణామాలు రావటానికి కొన్ని శతాబ్దాల కాలం పట్టింది. అసగా రవాణాసౌకర్యాలు పరిశ్రమల కనుగుణంగా అభివృద్ధి చెందినాయి.

ఈ క్రమ పరిణామాలకోరకు ఇరాన్ ఆగజాలపని ఐక్య రాజ్యసమితి నిపుణుల దళం అభిప్రాయపడింది. తన అవస రాలకు తగిన రోడ్లనూ, రైల్వేలనూ నిర్మించుకోవడానికి ఇరాన్‌కు వ్యవధీలేదు, ధనమూలేదు. రవాణాసౌకర్యాలలో మధ్యదశలైన రోడ్లు, రైల్వేలను విడచి ఇరాన్ అంతిమదశయైన విమాన యుగం లోకి నేరుగా ప్రవేశించడం మంచిది.

ఈ ఉద్దేశంతో ఐక్యరాజ్యసమితి తయారుచేసిన ప్రణాళికను ఇరాన్ ఒప్పుకొని, అధునిక వాయుయాన పద్ధతులను నెలకొల్ప డానికి నిపుణులను ఆహ్వానించింది. నెదర్‌లాండ్స్‌నుండి నలుగురు నిపుణులూ, నార్వేనుండి యిరువురూ, ఇంగ్లాండునుండి ఒకరూ ఇరాన్‌కుపోయినారు. ఇరానియనులు విదేశాల్లో వైమానిక విద్య నభ్యసించడానికి మూడు ఉచిత వేతనాలు ఏర్పాటు చేయ బడినాయి.

చేయవలసినపని చాలావుంది. విమానకంట్రోల్ తరగతులు ఏర్పాటు చేయబడినాయి. కంట్రోల్ బురుజులు నిర్మాణమైనాయి. వాతావరణ పరిశీలనా కేంద్రాలు దేశంలో అనేకచోట్ల యేర్పాటై నాయి. రేడియో ప్రసార పద్ధతులు బోధింపబడినాయి. వైమాని కులకు శిక్షణా, లైసెన్సులూ, యివ్వబడినాయి.

ఈ విధంగా విచిత్రమైన "గనట్" లు గల వంకరటింకర క్షేత్రభూములమీదుగా, హిమావృతమైన పర్వతాల ప్రక్కగా, ఒక

నగరంనుండి మరొక నగరానికీ, ఒక గ్రామంనుండి మరొక గ్రామానికీ, వస్తువులనూ, వార్తా పత్రికలనూ, మనుష్యులనూ, తపాలానూ మోసుకపోతూ ఇరాన్‌లో విమానాలు తిరుగుతున్నాయి. ముందుముందు రోడ్లూ రైల్వేలూ తప్పకుండా నిర్మింపబడుతాయి. కానీ అంతవఱకూ విమానాలే ఇరాన్‌లోని వివిధ ప్రాంతాలకు పరస్పర సంబంధాలను కల్పిస్తూవున్నాయి.

రెజాఖాన్ సంకల్పించినట్లే పరిశ్రమలతోనూ, విమానాలతోనూ, ఇరాన్ ఆధునిక దేశమైంది. కానీ ఇరాన్‌కు ఇంకా శాంతి సౌభాగ్యాలు లభించలేదు.

ఇరాన్‌లో దినదినమూ యేవో అల్లర్లూ, గలాటాలూ జరుగుతున్నాయి. ఈ అంతఃకలహాలు యేనాటికైనా అంతమొందితే ఐక్యరాజ్యసమితి తోడ్పాటుతో ఇరాన్ సృష్టించుకొన్న విమానదళం సౌభాగ్యవంతమైన దేశంమీద విహారం చేస్తుంది.

# 13. ప్రపంచపు చతుష్పథం - ఆఫ్ఘనిస్తాన్

తూర్పు పడమరలనుండీ, ఉత్తర దక్షిణాలనుండీ వచ్చే అతి పురాతనమైన బాటలు - ప్రపంచపు నలుమూలలను పరిచయంచేసేబాటలు-అన్నీ ఆఫ్ఘనిస్తాన్‌లో కలుస్తాయి. ఆధునిక రోడ్ల మాదిరి వుండవు అవి. దుమ్ముతో నిండిన బాటలు. ఒంటెల మీదా, గుర్రాలమీదా, గాడిదలమీదా, లేక కాలినడకతో, జనులు ఈ దార్లవెంట పోతుంటారు - దుమ్ములేపుకుంటూ. ఈ దారులు పడమట ఇరాన్‌కూ, ఉత్తరాన రష్యాకూ, ఆగ్నేయాన పాకిస్తాన్‌కూ పోతాయి. వేయేండ్లనుండీ ఈ దారులు వాడుకలో వున్నాయి.

ఆఫ్ఘనిస్తాన్ ఈ రహదార్ల కూటమిలో వున్నమాట నిజమే. ఐనా ప్రపంచమంతా దీన్ని దాదాపు విస్మరించింది. ఇది యెక్కడో మారుమూల పెట్టెలో వున్నట్లుంది. దీనికి రేవు పట్టణం లేదు; రైలు అనేదేలేదు. హిందూకుష్ పర్వతశ్రేణుల పలస దేశమంతా గుట్టలూ, మిట్టలే; దక్షిణాన ఒక యెడారి; ఈశాన్య మూలలో హిమాలయ పర్వత సానువులు - ఇదీ దేశ స్వరూపం.

నిరర్థకమైన పర్వత శ్రేణులు ఎంత నిరుత్సాహం కల్గించినా అక్కరకువచ్చే లోయలు అక్కడక్కడ లేకపోలేదు. ఈలోయల్లో గోధుమా, పండ్లూ పండుతాయి. ఎన్నోచోట్ల పర్వతాలలో కనుమ

లున్నాయి. వీటిలో అన్నిటికంటే పెద్దది కైబరు కనుమ. ఇది ఆఫ్ఘనిస్తాన్‌నుండి పాకిస్తాన్‌కుదారి తీస్తుంది. అందుకనే అనేక శతాబ్దాలనుండి ఈదారివెంట సైన్యాలూ, ఒంటెల ప్రయాణీకులూ, ప్రయాణంచేసినారు.

మొట్టమొదట ఆఫ్ఘనిస్తాన్‌మీద దాడి చేసినవాడు పర్షియా రాజు డరియుస్. 2400 ఏండ్లనాడు అతడు సైన్య సమేతంగా పర్వత శ్రేణులను దాటి ఈదేశాన్ని జయించి తన సామ్రాజ్యంలో కలుపుకొన్నాడు. తరువాత అలెగ్జాండర్ తన మశిడోనియన్ సైన్యాలతో పర్షియనులను తరిమి డరియస్‌ను చంపి, అతని సైన్యాలను నాశనం చేసినాడు. అలెగ్జాండర్ తన దండయాత్రల్లో ఆఫ్ఘనిస్తాన్ ఉత్తర సరిహద్దులోనున్న ఆక్సస్ నదీతీరం వరకూ ఆక్రమించుకొన్నాడు.

అలెగ్జాండర్ మరణించిన తర్వాత అతని సైన్యాలు విచ్ఛిన్న మైనాయి. అటుపిమ్మట ప్రాచ్యదేశాలకుపోయే రహదారులు రోమన్ సైన్యాల అధీనంలోకి వచ్చినాయి. తూర్పుదేశాలనుండి చీనాంబరాలూ, ఆభరణాలూ, రత్నాలూ, సువాసన వస్తువులూ, మసాలా దినుసులూ, ఒంటెలమీద రోమన్ సామ్రాజ్యంలోని పట్టణాలకు సాగుతూ వుండినాయి. ఇన్ని కథలు జరుగుతున్నా ఆఫ్ఘన్ ప్రజలు మాత్రం తమ గొర్రెల మందలను కాసుకొంటూ గరుగు భూములు పెట్టిన భిక్షతో కాలక్షేపంచేస్తూ వుండినారు.

7 వ శతాబ్దంలో అరేబియా నుండి మహమ్మదీయ మతం నిప్పులు గ్రక్కుతూ అఫ్ఘనిస్తాన్‌లోకి వచ్చింది. "అల్లా ఒక్కడే దేవుడు; ఆదేవుని దూత మహమ్మదు" అని ఒప్పుకొన్న వాళ్ళు గా బ్రతికిపోయినారు. తక్కినవారంతా ఆ మత ఖడ్గాలకు బలిఐనారు. అందువల్లనే ఈనాడు ఆదేశంలో అందరూ మహమ్మదీయులే.

తర్వాత తూర్పు దిశనుండి కొండలదారుల వెంట మంగోల్ విజేత చెంఘిజ్‌ఖాన్ ఉప్పెనలావచ్చి పడినాడు. అతని లక్ష్యం మతాంతరీకరణంగాదు; సర్వమూ నిర్ధూమధామం చేయటమే. అతనిరాకకు పూర్వం ఉత్తర అఫ్ఘనిస్తాన్‌లో వ్యవసాయానికి పనికి వచ్చేకొన్ని నీటి వనరులుండేవి. అతని సైన్యాలధాటికి ఆనీటి కాల్వలూ పచ్చని పైరులూ అన్నీ రూపుమాసి పోయినాయి. మార్కోపోలో అను యాత్రికుడు, ఆదారివెంట కూబ్లాఖాన్ ఆస్థానానికి పోయేనాటికి ఆ ప్రదేశమంతా బంజరుభూమిగా మారిపోయింది.

పందొమ్మిదవ శతాబ్దిలో బ్రిటీషువారు అఫ్ఘనిస్తానమును వశపరచుకొడానికి ప్రయత్నించినారు. అందుకు జరిగిన యుద్ధాలనే చరిత్రలో అఫ్ఘన్ యుద్ధాలంటారు. అఫ్ఘనులు ధైర్యంగా బ్రిటిషువారి నెదిరించి తమ స్వాతంత్ర్యాన్ని దక్కించుకొన్నారు. ప్రాచ్య ప్రపంచంలోని ఒక చిన్నదేశం పరాధీనంగాకుండా నిలవడం అరుదైన విషయం. అఫ్ఘన్‌రాజు ఈ నాటికీ స్వతంత్రుడుగానే యున్నాడు.

స్వీయాభిమానులూ, స్వేచ్ఛాప్రియులూ ఐనప్పటికీ, చాల మంది ఆఫ్ఘనులకు తమ దేశంమీద పూర్వం దండెత్తిన సైన్య సమూహాల సంగతిగానీ, తమ దేశంలో ప్రయాణం సాగించిన ఒంటెల తండాల సంగతిగానీ, యేమీ తెలియదు. డరియసన్నా, అలెగ్జాండరన్నా, ముస్లింమత ఖడ్గధారన్నా చెంఘిజ్ఖాన్ అన్నా, మార్కోపోలోఅన్నా, బ్రిటిష్‌వారి ఆఫ్ఘన్‌యుద్ధాలన్నా, ఆఫ్ఘనిస్తాన్ లోని సామాన్య జనులకు ఏమీ తెలియదు. ఈ క్రొత్తపేర్లు వారెప్పుడూ వినియుండరు. ఒకవేళ వినియున్నా, ఫలితంవున్న. వారికి అర్థంకాదు. ఈనాటి ఆఫ్ఘన్ ప్రజలకు పాత కథలను త్రవ్వుకొనే తీరికలేదు. వారి ప్రయత్నాలన్నీ తినడానికీ, బ్రతకడానికే.

**1951**లో ఆఫ్ఘనిస్తాన్‌కు పోయిన విల్లియం డౌగ్లాస్ అను పాశ్చాత్యునకు, ఆ ప్రజలెంతో స్నేహపాత్రులుగా గనుపించిరి. రోడ్డుమీద యెదురైన ఆఫ్ఘనులు "స్తారేమాషి; స్తారేమాషి" అని చేసిన అభివాదమువిని అతడు చకితుడైనాడు.

"ఏమి దీనిఅర్థం" అని అతడు తన మార్గదర్శకునడిగినాడు. "నీకెప్పుడూశ్రమ కలుగకుండుగాక" అని మార్గదర్శకుడు అర్థం జెప్పినాడు.

"మఱి నేనేం బదులు చెప్పాలి" అని డౌగ్లాస్ ప్రశ్నించినాడు. "క్యార్‌మాషి, (అనగా నీకెప్పుడూ దారిద్ర్యం లేకుండుగాక) అని బదులు చెప్పండి." అని మార్గదర్శకు డన్నాడు.

ఆపాశ్చాత్యుడా విధంగానే అన్నాడు. కానీ అతనికి తెలుసు - ఇవన్నీ కలలోని మాటలని. నిత్యశ్రమా, నిత్యదారిద్ర్యమూ లేని మానవుడా దేశంలో నేలేడు.

కష్టంచేయటం, కటికదారిద్ర్యం అనుభవించటం ఆఫ్ఘన్ ప్రజలలో సర్వసాధారణమైన విషయం. వారిలో నూటికి 85 మందికి చదువురాదు. ఐనా సంతృప్తి, స్నేహభావమూ, అతిథి సత్కారమూ ప్రశంసింప దగినవి. రంగురంగుల పేటాలు తలకుచుట్టి, నిడుపాటి కోట్లూ వదులైన పంట్లాములూ ధరించి, వారు ఎదురైనవారినందరినీ చిరునవ్వులతో పలుకరిస్తుంటారు. ముస్లిం స్త్రీల కందరికీ వున్నట్లే ఆఫ్ఘన్ స్త్రీలకు సిగ్గెక్కువ. ఒళ్ళంతా బురఖావేసుకొని కండ్ల దగ్గరుండే చిన్న కన్నాలద్వారా బాహ్యప్రపంచాన్ని పరికిస్తుంటారు. మఱి వారి మనసుల్లో యేముందో పరమాత్మునికే యెఱుక.

పర్వతాల మూలంగా పరస్పర సంబంధాలు తక్కువైనందువల్లనో యేమో ఆఫ్ఘనిస్తాన్‌లో ఒక ప్రాంతం మాట్లాడేభాష మరొక ప్రాంతంలో తెలియదు. మొత్తంమీద ఆఫ్ఘనులందరూ సంప్రదాయవాదులనవచ్చు; తండ్రి తాతలనాటి పద్ధతులు తప్ప, కొత్తపద్ధతులంటే గిట్టదువారికి. నూటికి తొంభైమంది పచ్చిక బయళ్ళలో తిరిగే అస్థిరనివాసులు, వాళ్ళ ఏకైక ఐశ్వరం గొఱ్ఱెల మందలు, ఆ గొఱ్ఱెలు వారికి మాంసమూ, చర్మాలూ, బొచ్చూ యిస్తాయి. ఉంగరాలు తిరిగిన అబొచ్చు విదేశ మార్కెట్లలో "కరాకుల్" అని ప్రసిద్ధికెక్కింది.

నిదానంగా. పచ్చిగడ్డిని వెతుక్కుంటూ, పర్వతాలమీద క్రిందినుండీ పైకీ, పైనుండి క్రిందికీ కరాకుల్ గొర్రెలను తోలుక పోతుంటారువారు. ఎండకాలంలో అంతో యింతో గడ్డి పర్వతాల పైభాగంలోనే దొరుకుతుంది; శీతకాలంలో పైనంతా మంచు, క్రింద లోయల్లో అక్కడక్కడా పచ్చని పసిరిక పొడ కట్టుతుంది. గడ్డి కనబడినచోట డేరాలువేసుకొని, కంబళ్ళు పరచి, పిడకలతో బియ్యమూ, మాంసమూ వండుకొంటూ కొన్నాళ్ళపాటు వుంటారు. గొర్రెలమందలు ఒకవైపు మేస్తూవుంటే, వారు బరువులుమోసే జంతువులకుగానూ మోటు కొడవళ్ళతో గడ్డి కోసుకుంటూ వుంటారు. స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ అందరూ కలిసి పనిచేస్తూ గొర్రెలబొచ్చు కత్తరించుకుంటూ అక్కడే వుంటారు. అక్కడున్న గడ్డి అయిపోగానే కంబళ్ళుచుట్టి, డేరాలు ముడిచి, మూటా, ముల్లే, కుండా, చట్టీ, అన్నీ గుర్రాలకూ, ఒంటెలకూ యెత్తుతారు. ముందు గొర్రెలమందను కొంపడు తోలుకపోతూవుంటే వారివెనుక బరువులుమోసే జంతువులూ, వాటివెంట తక్కిన పురుషులూ, స్త్రీలూ, పిల్లలూ నడుస్తూపోతారు. కోళ్ళు వుంటే గాడిదమీద బుట్టల్లో పెట్టుతారు; నడువలేని చిన్న పిల్లలను ఒంటెల మూపుమీద బిగిస్తారు. ఈ విధంగా జట్టు అంతా కదలి పోతుంది.

వాళ్ళునడిచేదారి సన్నని కాలిబాట. ఆబాట బ్రహ్మాండమైన గిరి శిఖరాలచుట్టూ, అగాధమైన లోయల అంచుల్లోనూ పోతుంది. నిదానంగా ఆబాటవెంట పోతారు వాళ్ళు – క్రొత్త పచ్చిక భూమిని

వెతుక్కుంటూ, తమ మందలకు మంచి ఆహారాన్నివ్వమని దేవుని వేడుకొంటూ.

ఇది నూటికి తొంభైమంది ఆఫ్ఘనుల నిత్యజీవితక్రమం. తక్కిన పదిమందిమాటో? వీరు దేశంలో ఉత్తరభాగాన వున్నారు. వీరుకూడా అస్థిర నివాసులే; అటు పడమటికో, యిటు తూర్పుకో ఒంటెలమీద యెక్కి ప్రయాణాలుచేస్తూ వుండే వ్యాపారస్తులు. ఎన్నోనూర్ల యేండ్లనుండి వ్యాపారస్తులంపరూ నడచిన దారుల వెంటనే ఈనాడూ వీరు ప్రయాణం చేస్తున్నారు. మార్కోపోలో అనుసరించినదారీ ఇక్కడేవుంది. వాటిల్లో ఒక దారిని ఇప్పటికీ సిల్కురోడ్డు అంటారు.

చలికాలంలో ఒంటెల వ్యాపార దళాలు, కారకుల్ చర్మాలూ, ఎర్రని కంబళ్ళూ, తోళ్ళూ, ఎండిన పండ్లూ, మొదలైన సరుకులతో ఈ దారులవెంట ఇండియాలోని పెషావర్‌కు పోతారు. అక్కడ చక్కెరా, ధాన్యమూ, బట్టలూ ఇంకా ఇతర పారిశ్రామిక వస్తువులు తీసుకొని తిరుగుదారిబట్టి నేరుగా మధ్యప్రాచ్య దేశాలకూ యూరప్‌కూ పోతారు.

ఇంతవ్యాపారం జరుగుతున్నా, ఈవ్యాపారస్తుల విషయం ఆఫ్ఘన్ ప్రజలకు సాధారణంగా పట్టదు. వాళ్ళపనితొందర వాళ్ళది. వారికి కాబూల్ నగరవాసుల విషయంగూడా పట్టదు. కాబూల్ ఆఫ్ఘనిస్తాన్‌కు ముఖ్యపట్టణం. ఆదేశంలో అటువంటి నగర

ముండటమే ఆశ్చర్యకరమైన విషయం. ఎందుకంటే కాబూల్‌లో విద్యుద్దీపాలుకూడా వున్నాయి – పెద్దవీధి కిరువైపులా మిలమిల మెరుస్తూ. కొన్ని యిళ్ళలో కొళాయిలూ, స్నానాల గదులూ, కూడా వున్నాయి. మొత్తంమీద కాబూల్ నాగరక నగరమే.

కాబూల్‌కు వెలుపల, చుట్టూ ఉద్యాన వనమున్న రాచనగరులో మహమ్మద్ జహిర్ – ఆఫ్ఘన్‌రాజు – తన చిన్ని కుమారునితోగూడా నివసిస్తున్నాడు. ఆయనకు అభ్యుదయ భావాలుగల సలహదార్లు కొందరున్నారు. వారిలో కొందరు పాశ్చాత్య దేశాల్లో చదువుకున్నవారూ వున్నారు. వారి సలహాలవల్లనే గావచ్చు ఆఫ్ఘనిస్తాన్ మొట్టమొదటనే ఐక్యరాజ్యసమితిలో చేరింది. సాంకేతిక సహాయ సంస్థ పుట్టీ పుట్టకముందే దాని సహాయాన్ని ఆఫ్ఘనిస్తాన్ అర్థించింది.

ఈ సలహాదారులు తమ దేశాభివృద్ధికి యెన్నో పథకాలు వేసి సాంకేతిక సహాయ సంస్థ సలహా అడిగినారు. నీటిపారుదల సౌకర్యాలను సృష్టించుకొని, చెంఘిజ్‌ఖాన్ విలయ తాండవానికి పూర్వమున్నట్లు దేశాన్ని సస్యశ్యామలం చేసుకుంటే బాగుంటుందా? సెలయేళ్లకు ఆనకట్టలుగట్టి విద్యుచ్ఛక్తినీ, దాని సహాయంతో రసాయనిక యెరువులనూ ఉత్పత్తి చేసుకుంటే బాగుంటుందా? రోడ్లూ రైల్వేలూ నిర్మించుకుంటే బాగుంటుందా? ఈ పనికి కొండల్లో సొరంగాలు త్రవ్వవలసి వుంటుంది. లేకపోతే గనులు త్రవ్వే యంత్రాలు పెట్టుకుందుమా? పర్వతాలలో అమూల్యమైన

ఖనిజ సంపద వుంది. ఈ ప్రశ్నలన్నిటికీ వారు సమాధానాలు కోరినారు.

వీటన్నిటికీ అనంతమైన ధనం కావాలి. ఆఫ్ఘన్ ప్రభుత్వానికి పెద్దపెద్ద కోరికలున్నాయి గాని డబ్బులేదు. అప్పు తీసుకోవచ్చు, కానీ యెవరిస్తారు? ఇస్తే మళ్లీ యెప్పుడు యెట్లు తీరుస్తారు?

అందుకని సాంకేతిక సహాయ సంస్థ ఈ క్రిందివిధంగా సలహానిచ్చింది. ఆఫ్ఘనిస్తాన్‌లో సంపదను సృష్టించటానికి అవకాశాలు దండిగా వున్నాయి. కానీ అందుకు కొంతకాలం పడుతుంది. ప్రస్తుతం చేయవలసినపని తన పెట్టుబడి శక్తిని అభివృద్ధిచేసుకోవడం. ఇది యెట్లు సాధ్యమౌతుంది అంటే, దేశంలో ప్రతియొకడూ తాను ఉత్పత్తిచేసే వస్తువులను ఇంకా యెక్కువగా ఉత్పత్తిచేయడంద్వారా. గొర్రెల కాపరులు గొర్రెల సంఖ్యను ఎక్కువచేయాలి. కొండచరియల్లో పంటలు పండించే రైతులు ఇంకా యెక్కువ పంటను పండించాలి. ప్రజలదగ్గర కూడిన ఈ అదనపు ఆదాయమే పెట్టుబడి ఔతుంది. ఈ పెట్టుబడితో ఎంతటి ప్రణాళికలైనా నిర్వహింపవచ్చును. ఐక్యరాజ్య సమితిద్వారా ప్రపంచంలో నిపుణులు ఆఫ్ఘనిస్తాన్‌కు సహాయపడడానికి సిద్ధంగా వున్నారు.

ఆఫ్ఘనుల ప్రధానమైన సంపద గొర్రెలు. మంచి కారకుల్ చర్మం ఈనాటికీ పదిడాలర్ల విలువచేస్తుంది. కానీ ఈ మధ్య

గొర్రెలు అమితంగా చస్తున్నాయి. పోయినయేడు అమ్మకానికి వచ్చిన చర్మాలసంఖ్య అంతకుముందు సంవత్సరం కంటే 40% తగ్గిపోయింది. ఆఫ్ఘనులకు యెంతో దిగులు పట్టింది; కానీ యేమిచేయాలో తోచలేదు. అసలు ఈ చావులకు కారణమేమో?- గాలిమార్పా? మేతతక్కువా? లేక రోగమా? ఏమో వారికి తెలియదు.

అది ఒక ప్రాణాంతకమైన గొర్రెల రోగమనీ, దానికి మందు టీకాలు వేయుటయేననీ ఐక్యరాజ్యసమితి నిపుణులు చెప్పినారు. కానీ "గొర్రెలకు సూదులు పొడుస్తారా? మందలు, మందలే చస్తాయేమో?" అని గొర్రెల కాపరుల వెర్రి అనుమానం.

ఈ గొల్లవాండ్లకు నచ్చజెప్పి ఒప్పించడానికి కొంతకాలం పట్టింది. తమ గొర్రెలకు సూదులు వేయటానికి ఒకరిద్దరు ఒప్పుకున్నారు. ఈ వార్త కొండలన్నీ వ్యాపించింది. దీనిఫలితమేమో చూడడానికి పదిమందీ వచ్చినారు. టీకాలు జయప్రదంగా ఫలించటం కండ్లారా చూచినారు. టీకాలు వేసిన గొర్రెలు బలంగా ఆరోగ్యంగా వున్నాయి. వాటి బొచ్చు మందంగా, చిక్కని ఉంగరాలు తిరిగి జిడ్డుజిడ్డుగా వుంది. చూడవచ్చిన వాళ్ళంతా తమ మందలకుగూడా మంత్రంలాంటి ఈ మందును వేయుమని ప్రార్థించినారు.

పంట కోయటంలోగూడా ఐక్యరాజ్యసమితి నిపుణులు ఆఫ్ఘనులకు సహాయపడినారు; గడ్డికోయటంలోనూ, గోధుమపైరు

కోయటంలోనూ వారు శ్రమలేని పద్ధతులను ఆఫ్ఘనులకు నేర్పినారు.

కోతకు ఆఫ్ఘనులుపయోగించే సాధనం పురాణకాలంనాటి కొడవలి, పిడికి అడ్డంగా ఒక కత్తిలాంటి దుంటుంది. కోతకోసే వాడు భూమిమీద కూర్చొని ఎడమచేత్తో గడ్డిపట్టుకొని కుడిచేత్తో కొడవలితో కోయాలి. ఈ పద్ధతిచాలా శ్రమతో కూడుకున్నది.

ఇంతకంటే ఐదంతలు వేగంగా గడ్డికోసే సాధనం ఒకటి స్విట్జర్లాండులో కనిపెట్టినారు. అక్కడకూడా కొండచరియల్లోనె గడ్డి వుండేది. ఒక స్విట్జర్లాండు నిపుణుడు ఈ సాధనం యొక్క ప్రదర్శనాన్ని యేర్పాటుచేసినాడు. ప్రజలు దాన్ని చూచినారు. ఇదేమీ పెద్ద ప్రణాళికకాదు. ఖరీదయ్యేదీగాదు. ఒక మనిషి ఉపయోగించే పనిముట్టుమాత్రమే. ఐతే ఇంతకుముందుకంటే ఐదంతలు పని జరుగుతుంది. అంటే పశువులకు ఎక్కువమేతా, మనుషులకు తక్కువశ్రమా. రైతులకు ఇంకా కొన్ని క్రొత్త పనిముట్లు ప్రదర్శింపబడినాయి. ఇవన్నీ సులభంగా తయారు చేసుకోవచ్చు; ఎవరైనా ఉపయోగింపవచ్చు.

గొర్రెలకు టీకాలు వేయడం, క్రొత్తవ్యవసాయ పనిముట్లను గురించి నేర్పడమేగాక, ఐక్యరాజ్యసమితి మలేరియా నిపుణులనూ, టైఫస్ నివారణ నిపుణులనూ శిశువుల రోగాలను గురించి ప్రత్యేక శిక్షణ పొందిన నర్సులనూ ఆఫ్ఘనిస్తాన్‌కు పంపింది. వీరు

ఇంగ్లాండ్, ఫ్రాన్స్, అమెరికా, ఆస్ట్రియా, బెల్జియం మొదలైన అనేక దేశాలనుండి తమ ప్రత్యేక ప్రావీణ్యతలతోసహా ఆఫ్ఘనిస్తాన్‌కు వచ్చినారు.

కొలదికాలంలోనే ఆఫ్ఘనిస్తాన్ తన సహజ సంపదలను అభివృద్ధి చేసుకోగలదు. నూనే, బొగ్గూ, ఖనిజాలూ ఎక్కువగా ఉత్పత్తి జేయవచ్చు. రైల్వేలూ, విమాన మార్గాలూ, ఆనకట్టలూ యేర్పరచుకోవచ్చు. ఇప్పటికేపైా ఐక్యరాజ్యసమితి ప్రవీణుల సహాయం వలన ఆఫ్ఘనులంపరూ కొంత సుఖమయమైన జీవితాన్ని, కొంతఆదాయాన్ని దాచిపెట్టుకోగల జీవితాన్ని, అందుబాటులోకి తెచ్చుకుంటున్నారు. ప్రపంచ చతుష్పథానికి మంచికాలం వచ్చింది.

---

# 14. భారతకర్షకునికి క్రొత్తభూమి.

శాంతీ, సమృద్ధీ సహజీవులు – ఒకటి లేకుండా రెండవది వుండజాలదు. ప్రపంచంలో సగంమంది ఆకలితోనూ దారిద్ర్యం తోనూ అలమటించినన్నాళ్ళూ శాంతికి స్థానంలేదు – ముఖ్యంగా ఆహార సమృద్ధి అసాధ్యంకాదని అందరూ నమ్మిన యీనాడు. ఈ మాటలు చెప్పింది జాన్‌బాయిడ్‌ఆను ఆంగ్ల అర్థికవేత్త. ఈ మాటల్లో యెంతో సత్యముందని బడుగుదేశాల ప్రజానాయకులందరూ అంటారు – ముఖ్యంగా భారత ప్రజానాయకులు. భారతప్రజలు ఇంగ్లాండుతో సుదీర్ఘమైన పోరాటం జరిపి 1950లో సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాదించుకొన్నారు. కానీ ఆ స్వాతంత్ర్యం చాలా మందికి పస్తు పండుకోటానికి మాత్రమే స్వాతంత్ర్యంగా కనబడుంది.

భారతదేశం యుగాంతరాలనుండీ వచ్చిన సంప్రదాయా లకూ, వివేకానికీ పుట్టినిల్లు. మహామహా మతకర్తలూ, వేదాం తులూ పుట్టినదేశం. భారతీయ కవిత్వం ప్రపంచమంతటినీ పులకింపజేసింది. భారత దేవాలయాల సౌందర్యం దేశదేశాల ప్రజలనూ ముగ్ధుల్నిజేసింది. బహుశా భారత ప్రజానాయకులు లౌకిక విషయాలకంటే యిటువంటి విషయాల నెక్కువ ఆదరించి నందువల్లనేమో దేశంలో ప్రజలకు కావలసినంత తిండి పండటంలేదు.

భారతదేశం బ్రహ్మాండమైనదేశం; రష్యా మినహా యూరప్ ఖండమంత వుంది; రాకీస్ పర్వతాలకు తూర్పునవున్న అమెరికా సంయుక్తరాష్ట్రాలంత వుంది. ఉత్తరాన హిమాలయా పర్వతాలు 1500 మైళ్ళ పొడవున వ్యాపించివున్నాయి–కోటగోడలాగా. దక్షిణ దేశానికి తూర్పున బంగాళాఖాతం, పశ్చిమాన ఆరేబియా సముద్రం వున్నాయి.

ఈ రెండు సముద్రాల్లోనూ కలుస్తూ మూడు బ్రహ్మాండమైన నదులున్నాయి. ఈ నదీతీరాల్లోనూ, సారవంతమైన మైదానాల్లోనూ ఎన్నోవేల సంవత్సరాల నాగరకతకు ఆలవాలమైన మహానగరా లున్నాయి.

ఈ నగరాలలోని దేవాలయాలూ, జనసమ్మర్దమైన వీధులూ వీటినిగురించి భారతదేశంలోనే చాలామందికి తెలియదు. దేశంలో ఏడింట ఆరుమంది కర్షకులు; పల్లెటూరేవాళ్ళ ప్రపంచం. రాళ్ళతోనో, యిటుకతోనో, లేకపోతే మట్టితోనో, తడికలతోనో తయారైన యిండ్లు; వూరిచుట్టూ పొలాలు. ఈ కర్షకులలో నాలుగైదు కోట్లమందికి సొంతభూమిలేదు. వాళ్ళకు కడుపు నిండా తిండి దొరకడమే అరుదు. కరువో, రోగమో వచ్చినప్పుడు వాళ్లబ్రతుకు బజారుపాలు.

ఈ అశేష జనసంఖ్యకు చాలినంత తిండి భూమిలో పండదో యేమో. అమెరికా సంయుక్తరాష్ట్రాలలో వున్నంత

మూడంతలమంది ప్రజలున్నారు. జనసంఖ్య ప్రతి సంవత్సరమూ పెరుగుతూనేవుంది – సంవత్సరానికి యాభైలక్షల వంతున. భూమిలో పండే పంటమాత్రం పెరగటంలేదు.

భారతదేశ జనాభా పటం చూస్తే వెంటనే కనపడే ఒక విషయమేమంటే కొన్నిప్రదేశాలలో జనం యెక్కువగా వుండటం, మరికొన్ని ప్రదేశాలు నిర్మానుష్యంగా వుండటం. దేశంలో అర్ధభాగంలో వ్యవసాయమూలేదు, జనులూ లేరు.

ఈ స్థితికి కారణంగూడా సులభంగానే తెలుస్తూవుంది. ఉత్తర యిండియాలో యెన్నోవిశాలమైన అరణ్యప్రదేశాలున్నాయి. ఈ ప్రదేశాలను సాగులోకి తెచ్చేనాథుడెవడూలేడు. “ఉత్తర ప్రదేశ్” రాష్ట్రంలో “తెరాయ్” అనేది అటువంటిదే ఒక అరణ్యం – నేపాల్ టిబెట్ దేశాలక్రింద హిమాలయా పర్వత సానువులనుండీ వ్యాపించి వుంది.

ఆ అడవిలో కొంతమందీ అడవి జాతులవాళ్ళున్నారు. పులులూ, ఏనుగులూ, తోడేళ్లూ, నక్కలూ, త్రాచుపాములూ అక్కడ రాజ్యం చేస్తున్నాయి. లోపలికి యెవరైనాపోతే ప్రాణాంతకమైన మలేరియాకు ఆహుతి కావలసిందే ఆ అరణ్యముండే ప్రదేశమంతా సారవంతమైన భూమి; కానీ సాగులోనికి తెచ్చే సాహసం యెవరికీలేదు.

ఈ "తేరాయ్" ఈనాడు నిరుపయోగంగా వుంది కానీ వేయేండ్లకు పూర్వం ఇక్కడ వ్యవసాయంచేసే ప్రజలుండినారు; అప్పుడు అరణ్యంలేదు. వ్యవసాయంకూడా మంచి ఉచ్ఛస్థితిలోనే వుండి వుండవచ్చు. గుంటలు నిర్మించుకొని పొలాలు తడుపుకుంటూ వుండినారు ఆనాటి ప్రజలు. అటుతరువాత అడవి క్రమక్రమంగా భూమినాక్రమించుకొంటూ వచ్చింది. అడవిలోని నీటి మడుగుల్లో దోమలు వృద్ధిఐనాయి. వాటివల్ల వచ్చే మలేరియాతో వ్యవసాయం అంతమైంది. భయమూ బాధా పెనవేసుకొనివున్న ఆ ప్రదేశానికి యెంత దిక్కులేనివాడైనా పోడు. ఒకవేళ పోయినా చెట్టూ పొదలూ కొట్టి భూమిని సాగులోకి తెచ్చుకోవడం అసాధ్యం; ఒకవైపున కొట్టుతూవుంటే మరొకవైపున త్రోసుకవస్తూ వుంటుంది అరణ్యం. అసలు పని మొదలుపెట్టకముందే వాన్ని మలేరియా క్రుంగదీస్తుంది. "తేరాయ్" ఒక నరకం—ఆ సంగతి అందరికీ తెలుసు.

అందువల్ల వెయ్యేండ్లుగా 'తేరాయ్' అరణ్యాన్ని అదుపులోకి తెచ్చుకొలానికి ఎవరూ పూనుకొలేదు. కానీ అదంతా సారవంతమైన, సంపత్కరమైన భూమి – ప్రజలకు యెంతో అవసరమైనభూమి.

భారత ప్రభుత్వం తొలిరోజుల్లోనే "తేరాయ్" లోని అడవిని కొట్టివేయవలసిందని ప్రజలను ఉద్బోధించింది; "ఆహారం అధికంగా పండించండి." "అడవులు నరికితే ఆహారం అధికంగా పండించవచ్చు" అనే నినాదాల నిచ్చింది.

కాని "తేరాయ్" ని సమీపించడానికి ప్రజల కందరికీ భయమే. హిమాలయా పర్వతాలలోని "తారూ" "బక్సా" అనబడే రెండు కొండజాతుల ప్రజలు - దేహదార్ఢ్యంగల అనాగరక ప్రజలు - మాత్రం "తేరాయ్" లోని చెట్లు చేమల నరికి అక్కడ నివసించడానికి సాహసించినారు, వాళ్ళు వశంచేసుకొన్న భాగంతప్ప మిగత అరణ్యమంతా నిర్మానుష్యమే. 1947లో ఇదీ పరిస్థితి.

సాంకేతిక సహాయ సంస్థయొక్క సహాయాన్ని ప్రప్రథమంగా అర్థించినదేశాల్లో ఇండియాకూడా ఒకటి. "అధికాహారోత్పత్తి కొరకు తెరాయ్‌ని సాగులోకి తెచ్చేదెల్లా? అని ఇండియాప్రశ్న.

త్వరలోనే ఒక ప్రణాళిక సిద్ధంచేయబడింది. మలేరియా నిర్మూలన అందులో మొదటి అంశం. మలేరియాకు కారణభూతమైన దోమలను తుదముట్టిస్తే, ప్రజలు నిర్భయంగా అడవిలోకి పోవచ్చు, భూమిని సాగులోని తేవచ్చు.

1949 వేసవిలో "తేరాయ్" కొండజాతులవారు నివసించే ప్రదేశాలలోకి వాళ్లకు వింతగొలిపే మోటారుబండ్లు కొన్ని వచ్చినాయి. ఆ బండ్లలో, ఒకదానిలో గ్రీకుదేశపు మలేరియా నిపుణుడూ, మరియొకదానిలో ఇంగ్లాండుదేశపు ప్రజారోగ్య సర్జనూ వుండినారు. తక్కినవి లారీలు; ఆ లారీలలో పెద్దపీపాలూ, మందులుచల్లే పరికరాలూ వున్నాయి. అడవి పొదలమధ్య

నిదానంగా దారి చేసుకుంటూ వచ్చి వారు తమ సామానుల మూటలువిప్ప అక్కడే నివాసం చేయటానికి సిద్ధపడినారు.

డీడీటీ అనే మందు చల్లి మలేరియాను రూపుమాపడం యేమీ కష్టమైనపనిగాదు. దోమలున్నచోట మందుచల్లితే దోమలు చస్తాయి. అందువలన దోమలు యెక్కడెక్కడ వుండటానికి వీలున్నదో అక్కడంతా మందుచల్లాలి. ఇదేమీ కష్టమైనపని గాదు, గనుక ఆవచ్చిన పరివారం తమ పరికరాలతో మందు చల్లటానికి ఉత్సాహంగా పూనుకున్నారు. అయితే దోమలు అరణ్యంలోనె గాకుండా, ఆటవికుల యిళ్ళలోగూడా వుండినాయి. ఆధునిక పరికరాలను యెన్నడూ చూడని ఆటవికులు ఆపరికరాలు తమమీద ప్రయోగించే ఆయుధాలని భయపడడమూ, మందు చల్లేవాళ్ళను తమయిళ్ళలోకి రానివ్వకపోవడమూ జరిగింది. రాబోయినవాళ్ళతో యుద్ధం చేయడానికిగూడా వారు సిద్ధమైనారు.

వచ్చిన నిపుణులూ, వారి పరివారమూ, తమ పథకం కొనసాగాలని యెంత ఉత్సాహమున్నా, తమ కార్యక్రమం మార్చుకోవాల్సివచ్చింది. ఎంతో ఓర్పుతో ఆటవికులతో స్నేహం చేయటం మొదలుపెట్టినారు. ఆ పరివారంలోని డాక్టర్లూ, నర్సులూ, ఆటవికుల పిల్లలలో జబ్బుచేసిన వారికందరికీ పెన్సిలిన్, సల్ఫా, మందులిచ్చి జబ్బులు నయం చేసినారు. ఆ పిల్లల తల్లులందరూ కృతజ్ఞత చూపడమేగాక, కొత్తవాళ్లు సజ్జను

లన్నీ, స్నేహపాత్రులనీ తమ తమ భర్తలకు నచ్చజెప్పినారు. ఈ పరిణామంతో మలేరియా పథకం తిరిగి మొదలు పెట్టటానికి వీలుచిక్కింది.

ఈ విధంగా ఆటవికుల నమ్మకం సంపాదించుకొన్న తర్వాతగూడా పని త్వరత్వరగా సాగలేదు. ఎందుకంటే మలేరియా దోమల్లో రెండురకాలున్నాయి; ఒకటి వసంత ఋతువులో వృద్ధిపొందేది, మరొకటి హేమంత ఋతువులో వృద్ధిపొందేది; అనగా డీడీటి మందు సంవత్సరానికి రెండుసార్లు చల్లినలసి వచ్చేది. అంతేగాక మట్టిగుడిసెలలోని గోడలకు ప్రతి పండుగకూ క్రొత్త మట్టి పూయుటం ఆటవికుల మతాచారం. మట్టిపూసినప్పుడల్లా తిరిగి మందు కొట్టాలి. అరణ్య ప్రదేశం గాబట్టి ముఖ్యంగా మందు చల్లవలసిన నీటి మడుగులను వెదకివెదకి మందు చల్లడం చాలాకష్టం; వర్షాకాలంలో మరీకష్టం.

ఐనా యెంతో ఓర్పూ నేర్పూ ప్రదర్శించి పనిసాగించినారు. త్వరలోనే 15 లక్షల యెకరాల అడవి స్వాధీనం చేసుకోబడింది. ఆ సారవంతమైనభూమి అంతా వ్యవసాయానికి సిద్ధంగావుంది – అక్కడ మలేరియా భయం తీరిపోయింది.

తరువాత అక్కడికి బుల్‌డోజర్లూ, ట్రాక్టర్లూ, మనుశలూ వచ్చినాయి. పులులూ, తోడేళ్లూ, ఏనుగులూ అరణ్యంలోని యితర భాగాలు చేరుకున్నాయి. చెట్లూ, పొదలూ కొట్టి భూమి

చదును చేసి, వర్షపునీరు పారిపోయే యేర్పాట్లుచేసి, గొట్టంబావులు త్రవ్వి వ్యవసాయానికి అన్నిసౌకర్యాలూ చేసినారు.

ఈ విధంగా కొత్తభూమి - బంగారుపండే సరికొత్తభూమి- సృష్టింపబడింది.

కానీ దోమలు నిర్మూలింపబడినంత మాత్రాన, భూమి వ్యవసాయానికి సిద్ధమైనంత మాత్రాన పని తీరిపోలేదు. ఆ భూమిని సద్వినియోగం చేసుకోవటం ప్రజలకు నేర్పించాలి.

ఆ భూమినుండి గరిష్ఠ ఫలితాలను పొందే పద్ధతులు ప్రజలకు నేర్పటానికి ఒకసాంకేతిక సహాయకులదళం యేర్పాటు చేయబడింది. ఆ నిపుణులు బ్రిటన్, అమెరికా, హాలండు, డెన్మార్క్, గ్రీస్‌దేశాలనుండి వచ్చినారు. వ్యవసాయ వృక్ష శాస్త్రమూ, పశుపాలనమూ, ఆహార పదార్థాలు నిలువచేయటం, చర్మాలకు క్రమవేయటం, పాలపొడి తయారుచేయుటం - ఈ విద్యలలో వారు ప్రవీణులు. చేతిపనిముట్లు తయారు చేసుకొనటంలో ప్రజలకు సలహా లివ్వటం, కొంతమంది కలిసి ట్రాక్టర్లవంటి విలువగల యంత్రాలను తెప్పించుకోవాలంటే వారికి తగిన సహాయం చేయటం - ఇట్టి పనులుగూడా ఆ నిపుణులు చేయగలరు. వారి ద్వారా "తేరాయ్" ప్రజలకు ప్రపంచంలోని అత్యుత్తమ ఆహారోత్పత్తి పద్ధతులు అందుబాటులోనికి వచ్చినాయి.

అప్పుడు "తెరాయ్"లో ఒకటొకటే కొత్తయిళ్ళు లేచినాయి. భూమి సస్యశ్యామల మైంది, పొలాలకు కంచెలు వేయబడి నాయి. ప్రతియేడూ కొత్త జనంవచ్చి అక్కడ స్థిరపడిపోతున్నారు. వారందరూ నడిచివచ్చినవాళ్లే; అందులో కొందరు తమ సర్వస్వమూ మూటగట్టి నెత్తినబెట్టుకొని నాలుగువందల మైళ్ళు నడిచి వచ్చినవారున్నారు.

"తెరాయ్" వలెనే యితర జిల్లాలలో, యితర ప్రదేశాలలో నిరుపయోగంగా వుండే భూములన్నీ కొద్దికాలంలోనే ఫలవంత మౌతాయి. నిత్యప్రవర్ధమానమగు భారత ప్రజా సముదాయం క్రమక్రమంగా తమకు కావలసిన ఆహారాన్ని పండించుకోగలదు. ఇండియాలోని ఆహార సమస్యను పరిష్కరించటానికి ఐక్య రాజ్యాల సాంకేతిక సహాయసంస్థ ఈ విధంగా దారి చూపింది.

---

# 15. సింహళం అగ్రగాములు.

"పరాక్రమబాహు" అనేపేరు యీనాడు, సామాన్యంగా యెవరూ వినియుండరు. కానీ వెయ్యేండ్ల క్రిందట అతనికీర్తి ప్రాచ్య ప్రపంచంలో వినని వారులేరు. సింహళ ద్వీపంలోని లంకా రాజ్యం పరిపాలించిన ఒక గొప్ప రాజవంశంలో జన్మించిన మహా బలవంతుడైనరాజు అతడు.

పదకొండుమైళ్ళ వైశాల్యమున్న ఒక తటాక తీరంలో "పొల్లొనారువ" అనే నగరంలో ఏడంతస్తుల రాజసౌధంలో అతని నివాసం. అతడూ అతని వంశీయులూ అందరూ గొప్ప ఇంజనీర్లు. వాళ్ళు సింహళ మధ్యదేశంలో ఐదువేల చెరువులు త్రవ్వించి అన్ని చెరువులనూ కలిపేటందుకు ఒకదానినుంచి మరొకదానికి కాలువలు త్రవ్వించినారు. వర్షాకాలంలో ఈ చెరువు లన్నీ నిండి, దేశంలోని వరిమళ్లకు నీటిభయం లేకుండా చేసేవి. ఆ రాజుల పరిపాలనలో సింహళంలో పండినంత వరిపంట ఆనాడు యేదేశంలోనూ పండేదిగాదు.

పంద్రెండవ శతాబ్దిలో ఉత్తరంనుండి జరిగిన దండయాత్రల వల్ల లంకా రాజ్యం సర్వనాశనమైంది. సైన్యాలూ, ఏనుగులూ చెరువు కట్టలను నేలమట్టం చేసినాయి. నీళ్ళులేకుండా వరిపండదు

గాబట్టి వరిపండే భూములను వదలిపెట్టి ప్రజలు యితర ప్రదేశాలకు పోయినారు. ఆ భూమి అంతా చెట్లుచేమలు బలిసి అరణ్యమైపోయింది.

హిందూ మహాసముద్రంలో ఇండియాకు దక్షిణంగావున్న సింహళ ద్వీపం ఈనాడు ప్రపంచంలో అతి జనాకీర్ణమైన దేశాలలో ఒకటి. సింహళం జనసంఖ్య 75,00,000. ఐనా అందులో సగం మందికిపైన సముద్రతీరంచుట్టూవున్న తడి ప్రదేశంలో – అనగా దేశవిస్తీర్ణంలో పాతిక భాగంలోనే – వున్నారు. తక్కినభాగమంతా బీడూ, అడవీ.

పూర్వపు లంకరాజులుచేసినట్లే ఆ ప్రదేశాన్నంతటినీ, సస్యశ్యామలం చేయాలని 1933లో సింహళ ప్రభుత్వం నిశ్చయించింది. అడవిని కొట్టివేసి, జలాధారాలు కల్పించి, క్రొత్త ప్రజలను అక్కడ చేరేటట్లు చేయాలని ప్రభుత్వం నిశ్చయించుకుంది. వ్యవసాయ నీటి పారుదలకూ, వరద నివారణకూ, తక్కువ ఖర్చుతో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికీ, తగినట్లు గొప్ప "గాల్ ఓయా" ఆనకట్టను కట్టడానికి "మారిసన్, నడ్సన్" అను అమెరికా కంపెనీ నియమింపబడింది. ప్రణాళిక ప్రకారం 1953లో 120,000 యకరాలూ తరువాత 250,000 యకరాలూ మాగాణిభూములౌతాయి.

అడవి కొట్టడం సాగేకొద్దీ, ప్రజలు క్రొత్త మాగాణి భూమిలో నివసించడం ప్రారంభించినారు. అరణ్యంచుట్టూ చిన్న చిన్న

గృహాలు అవతరించినాయి. నూరేండ్లనాడు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కొత్త భూములను వశంచేసుకొంటూ పశ్చిమానికి తరలిన "అగ్రగాముల" వలెనే, కొత్తగా యిక్కడ చేరినవారంతా అగ్రగాములు.

ఈ అగ్రగాములు యిప్పుడు 17 కాలనీలూ, 39 గ్రామాలూ నిండియున్నారు. అందులో కొన్నింటిని చేరడానికి యెగుడు దిగుడు అడవిదారులేగతి – జీపులుతప్ప యేవీ పోలేవు.

అమెరికాలో పశ్చిమదేశానికి పోవడానికి ప్రజలు సులభంగా వొప్పుకున్నారని అంటారు. సాహస కార్యములయందాసక్తీ, వర్తమానంమీద విసుగూ, భవిష్యత్తుమీద ఆశా, వారిని ముందుకు త్రోసినాయి. సింహళ ప్రజలను యేశక్తులు అరణ్యపు టంచుకు త్రోసుక వచ్చినాయో చెప్పలేము, గాని యాభైవేలకు పైగానే వచ్చినారు.

అడవులు కొట్టినంతమాత్రాన, నీటివనరులు కల్పించినంత మాత్రాన లాభంలేదు. ప్రజలు పైర్లునాటి, పంటలు పండిస్తేనే లాభం. ఆ పనులలో ప్రజలకు సహాయం చేయాలనే ఉద్దేశంతో సింహళ ప్రభుత్వం సాంకేతిక సహాయ సంస్థను సలహా అడిగింది.

"మా ప్రజలు ఓర్పుతో కష్టపడి పనిచేసేవాళ్ళు; మంచి రైతు సంప్రదాయంగలజాతి. కానీ వ్యవసాయం మొదలైన పనుల్లో క్రొత్త పద్ధతులను నేర్చుకోడానికి వారికిఅవకాశమే లేదు.

వాళ్లకు చదువైనావస్తే ఈ విషయాలు త్వరగా నేర్పవచ్చు, గానీ వాళ్ళు చిన్నప్పటినుండీ కష్టం చేసుకుంటున్నారేగానీ ఐడికైనా పోలేదు. ఏంచేయమంటారో మాకు దయయుంచి చెప్పండి" అని సింహళ ప్రభుత్వం అడిగింది.

సాంకేతిక సహాయ సంస్థ సలహా ఫలితంగా సింహళంలో ఒక విద్యా కేంద్రం వెలసింది. ఆ విద్యా కేంద్రం నాలుగురోడ్లు కలిసేచోట "మిన్నేరియా" అనే గ్రామంలో యేర్పాటు చేయబడింది. ఐక్యరాజ్య సమితియొక్క నాలుగుశాఖలు కలిసి ఆ కేంద్రాన్ని నడిపిస్తున్నాయి. దానిద్వారా ప్రపంచంలోని అత్యుత్తమ సాంకేతిక నిపుణుల సలహాలు "అగ్రగాము"లకు లభిస్తున్నాయి.

ఉపాధ్యాయులకు శిక్షణ యివ్వడమూ, పుస్తకాలు తయారు చేయడమూ, మిన్నేరియా కేంద్రం చేసిన మొట్టమొదటి పనులు. అక్కడ స్థానిక ఉపాధ్యాయులు చాలామంది ప్రత్యేక శిక్షణ పొందినారు. వయోజనులకు వాచకాలు వ్రాసి ప్రకటింప బడినాయి. సింహళభాష, తమిళభాష – ఈ రెండు భాషలవారూ అక్కడ వున్నారు గాబట్టి, రెండు భాషలలోనూ వాచకాలు ప్రకటింపబడినాయి.

ఈ వాచకాలు అన్ని విషయాలమీదా వ్రాయబడినాయి. మొదట "బియ్యం చరిత్ర" అను వాచకం ప్రథమ ముద్రణ ఐదువేల ప్రతులు వేయబడింది. తరువాత జాతి చరిత్రా, కథలూ,

మతమూ, ఆరోగ్యమూ మొదలైన విషయాలమీద పుస్తకాలు తయారైనాయి.

ఉపాధ్యాయులు పాఠ్య పుస్తకాలతోసహా జీపులో అరణ్య గ్రామాలకు చేరుకుంటారు. పగలంతా పనిజేసిన వరిమళ్ళనుండీ విద్యార్థులు బడికివస్తారు. వచ్చేటప్పుడు కిరసనాయిల్ లాంపులు తీసుకొనివస్తారు; వారు తిరిగి పోయేటప్పటికి బాగా చీకటౌతుంది.

కొద్దికాలంలోనే వారు, స్త్రీలూ పురుషులూ – ఒక్కొక్కరే చదవటం నేర్చుకొన్నారు. ఒక్కొక్క అక్షరం గాకుండా మొత్తం వాక్యమంతా ఏకధాటిగా చదవటం, అర్థాన్ని గ్రహించటం నేర్చుకొన్నారు. తరువాత ఉపాధ్యాయునితో పుస్తకాలు యిప్పించుకొని తమంతకుతామే చదువుకొనటం ప్రారంభించినారు కొంతమంది నెలకు ఆరు పుస్తకాలవంతున చదివినారు.

చదువు నేర్చుకొనటం ఉత్సాహకరంగానూ వుంటుంది, ఉపయోగ కరంగానూ వుంటుంది – కాని కొత్తభావాలను గ్రహించటానికి యితరమార్గాలుకూడా వున్నాయి. సినిమాలద్వారా ప్రజలు యెంతో నెర్చుకొనవచ్చు. తమ దేహాలను గురించీ, యింకా యెన్నో విషయాలను గురించీ నేర్చుకోవచ్చు. మంచి వడ్లు పండించటం, పైర్లను నాశనంచేసే యెలుకలనూ నత్తలనూ నిర్మూలించటం, సబ్బు తయారుచేయటం, తేనెటీగలు పెంచటం, గుడ్డలూ యిటుకలూ తయారుచేయటం, మంచి యిండ్లు కట్టు

కొనటం - యివన్నీ సినిమాలద్వారా నేర్చుకోవచ్చు. ఇవన్నీ వారు నేర్చుకొనవలసిన క్రొత్తవిషయాలు - క్రొత్త అనుభవాలు - క్రొత్తజీవితం. ఇవన్నీ సినిమాలవల్ల ప్రజలకు నేర్పింపవచ్చు.

రెండురోజులకొకసారి మిన్నేరియా విద్యాకేంద్రంనుండి సినిమా ఫిల్ములు తీసుకొని ఒకజీపు అరణ్యగ్రామాలకు పోతుంది. జీపులో ఒక విద్యుచ్ఛక్తి జనరేటర్‌కూడా వుంటుంది. చీకటి పడేటప్పటికి పాఠశాల భవనంలో సినిమా ప్రారంభమౌతుంది. జీపు రాకముందే ప్రేక్షకులు కూర్చొని వుంటారు - జీపుకొరకు యెదురుచూస్తూ.

మొదట తప్పకుండా ఒక వినోద ప్రదర్శనం వుంటుంది. పగలంతా వరిమళ్ళలో కష్టంచేసినవాళ్ళను కొంచెంసేపు నవ్వించకపోతే వాళ్ళను వంచించినట్లుంటుంది. దాని తర్వాత వ్యవసాయమూ, ఆరోగ్య శాస్త్రమూ, చాపలు అల్లడమూ, యిల్లు కట్టడమూ మొదలైన విషయాలమీద ప్రదర్శనలుంటాయి.

ఆ సినిమా బొమ్మలనుచూసి ప్రేక్షకులు ముగ్ధులౌతుంటారు. సినిమా అవగానే వారు తమచేతి లాంపులను వెలిగించుకొని యింటి ముఖం పట్టుతారు. ఆ అరణ్య ప్రాంతానికి యివన్నీ వింత విషయాలు. ఉల్లాసకరమైన జ్ఞానం పల్లె ప్రజలకు అందించే విశ్వ విద్యాలయంవలె వుంది సినిమా.

అమెరికా సంయుక్త రాష్ట్రాల చరిత్ర చదివినవారికి పశ్చిమ దిశకు తరలిపోయిన "అగ్రగాములు" ఎంత ఒంటరితనం అనుభవించినారో తెలుసు. వారికి పుస్తకాలులేవు, చదువురాదు; చుట్టుప్రక్కల యెక్కడా డాక్టరులేరు, ఆరోగ్యశాస్త్రంలో ఓనమాలుగూడా తెలియవు. అడవిలో రహదారులులేవు -- తాము చేసుకొన్న దారులుతప్ప; ఎద్దుబండ్లో, గుఱ్ఱపుబండ్లోతప్ప వేరు ప్రయాణ సాధనాలులేవు. అట్టి పరిస్థితులలో అమెరికన్ "అగ్రగాములు" విమానాలనుగురించి ఊహించటానికే వీలులేదు.

అమెరికన్ "అగ్రగాములు" యెంత కష్టపడినారో అంత కష్టమూ సింహళ ప్రజలూ పడుతున్నా, వీరు అమెరికనులకంటే అదృష్టవంతులు, ఎందుకంటే వీరికి ఐక్యరాజ్య సమితియొక్క సహాయమూ, సలహా వున్నాయి.

---

# 16. పాకిస్తాన్ జలమార్గాలు.

1947 కు పూర్వం పాకిస్తాన్ ఇండియాలో ఒకభాగం. ఆ భాగంలో "అల్లాఒక్కడే నిజమైన దేవుడు" అని నమ్మే మహమ్మదీయులు నివసిస్తూ వుండిరి. ఇప్పుడు పాకిస్తాన్ ఒక స్వతంత్ర ప్రజాతంత్రదేశం.

"పాకిస్తాన్" అనేది పర్షియన్ పదము. "పాకి" అంటే స్వచ్ఛమైన, పవిత్రమైన, ఉన్నతమైన అని అర్థం. "స్తాన్" అనగా దేశం. పాకిస్తాన్ అనగా పవిత్రదేశం. ఇది మహమ్మదీయులు గర్వంతో పెట్టుకున్న పేరు గాకపోవచ్చు. తమ దేశాన్ని పవిత్ర మైనదిగా చేయాలన్న కాంక్షతో, ఆశతో పెట్టుకొన్న పేరు గావచ్చు.

పాకిస్తాన్ పటముచూస్తే ఒక విచిత్రం వెంటనే కనబడు తుంది – పాకిస్తాన్ రెండుభాగాలుగా వుంది, యిండియాకు తూర్పున ఒకభాగం, పడమట ఒక భాగం. అరేబియా సముద్రం ఆనుకొనివున్న పడమటిభాగంలో, ముఖ్యపట్టణమైన కరాచీవున్న సింధురాష్ట్రమూ, ఏ పైరూ పండని పర్వతమయమైన బెలూచిస్తాన్ రాష్ట్రమూ, గోధుమలూ యితర తృణ ధాన్యాలూ, పండ్లూ పత్తీ పండే పంచనదుల పంజాబురాష్ట్రంలో కొంతభాగమూ వున్నాయి.

ఇండియాకు తూర్పునవున్న తూర్పు పాకిస్తాన్‌లో అడవులూ, బురద ప్రదేశాలూ, బంగాళాఖాతంలో పడేముందు అనేక పాయ లైన గంగానదీ వున్నాయి. దీనినే తూర్పు బెంగాల్ అనికూడా అంటారు. ఇక్కడ వర్షపాతమూ ఎండా ఎక్కువగా నున్నందున సంవత్సరానికి రెండుపంటలు పండుతాయి. బియ్యమూ, చెఱకూ, నూనె గింజలూ పండుతాయి, బొగ్గు విస్తారంగా దొరుకుతుంది, ఇనుముకూడా వుంది కానీ యింతవరకూ వెలికి తీయ లేదు.

మహమ్మదాలీజిన్నా పాకిస్తాన్ సృష్టికర్త. ఇతడు కరాచీలోని ఒక ధనిక వ్యాపార కుటుంబంలో జన్మించినాడు. "బక్క పలుచనివాడు" అని యితనిని అందరూ అనేవారు. ఇతడు లండన్‌లో న్యాయశాస్త్రం అభ్యసించినాడు. ఇది యాభైయేండ్లకు పూర్వం మాట. "చిత్రమైన పసుపు రంగుకోటు తొడుక్కున్న బక్కపలుచని పిల్లవాడు" అని లండన్‌లో యితని పరిచయం. లండన్‌లో చదువుకునేటప్పుడు ఇతడు తీరిక సమయాల్లో షేక్స్పి యర్ నాటకాల్లో వేషాలు వేస్తూవుండేవాడు.

ఇండియాకు తిరిగి పోయిన తరువాత ఇతడు హిందూ ముస్లిం ఐకమత్యం కొరకు చాలాయేండ్లు పాటుపడినాడు. ఈ విషయంమీద గాంధీతోనూ, యితర భారత నాయకులతోనూ ఎన్నో చర్చలు జరిపినాడు. కానీ హిందూ ముస్లింల మధ్యనున్న భేదాలు అగాధమైనవి. అందువలన 1947 ఆగష్టులో, ఇండియాలో

ముస్లింలు అధిక సంఖ్యాకులుగా వున్న ప్రాంతాలు జిన్నా నాయకత్వంక్రింద పాకిస్తాన్‌గా యేర్పడినాయి.

పాకిస్తాన్‌లో పదికోట్లమంది మహమ్మదీయు లుండినారు. ఇండియాలో మిగిలిపోయిన మహమ్మదీయులూ కొంతమంది పాకిస్తాన్‌కు వచ్చినారు. పాకిస్తాన్‌లోని హిందువులు ఇండియాకు పోయినారు. సరిహద్దులు దాటి వచ్చేపొయ్యే హిందూ ముస్లింల వలస ఒక దుర్భరమైన దృశ్యం. 1951 లో ఇండియానుండి 15 లక్షలమంది ముస్లిం కాందిశీకులు పాకిస్తాన్‌కు వచ్చినారు. కరాచీవంటి నగరాలలో రోడ్లప్రక్కన చింపిరి గుడిసెలలో వీరు తలదాచుకొనడం. చెప్పులు రిపేరుచేయుడం, చెక్కపనీ, రంగుల అద్దకం, కుంపట్లమీద చేసిన తినుబండారాల అమ్మకం-ఇవి వీరి జీవనాధారాలు. కరాచీ రేవుకు నెలనెలా వచ్చే యెనభై తొంభై ఓడలనుండి సరుకులను వీరే దింపేవారు. వారి స్త్రీలు రంగు రంగుల చీరలతో, చారల రవికలతో, ఎండకు మెరిసే గాజులతో, నెత్తిమీద ఉప్పుగంపలు మోయడం ఎవరైనాచూసి యుండవచ్చు.

మహమ్మదాలీ జిన్నా ప్రెసిడెంటుగా యేర్పడిన క్రొత్త పాకిస్తాన్ ప్రజాతంత్ర దేశంలోవున్న సమస్య ఆహారోత్పత్తిగాదు. పాకిస్తాన్‌లో జనసంఖ్య యెక్కువగాలేదు. బొత్తిగా మనుష్యులు లేని యెడారి ప్రదేశాలూ, కొద్దిగా మనుష్యులున్న బీదభూములూ పాకిస్తాన్‌లో అక్కడక్కడా వున్నాయి. సారవంతమైన ప్రదేశా

లలో కాలువలద్వారా నదీ జలాలు ప్రవహిస్తున్నాయి-పంజాబులో సింధునదియొక్క ఐదు ఉపనదులూ, బెంగాల్‌లో నూరు పాయలుగా చీలిన గంగానదీ. సముద్రంతో కలిసేముందు గంగానది అనేకపాయలుగా చీలినందున సముద్రతీరభూమి అంపపు పండ్లవలెవుంది. ఈ పాయులమధ్య భూమిలో సులభంగా నీళ్లు పారబెట్టుకోవచ్చు.

పాకిస్తాన్‌లో ముఖ్యసమస్య పండిన ఆహారాన్ని ప్రజలకు పంచడమే. పంజాబులోని సారవంతమైన మైదానాల్లో బియ్యం సమృద్ధిగా పండుతాయి; కానీ వాటిని యెడారి ప్రాంతమైన సింధు రాష్ట్రంలోని ప్రజలకు ఏ విధంగా అందజేయాలి? ప్రపంచంలో యెక్కడా పండనంత జనుం బెంగాల్ ప్రజలు పండిస్తారు; కానీ దానిని విదేశాలకు తీసుకపోయే ఓడలలోకి చేర్చేదెట్లు? ధాన్యమూ, పండ్లూ, నూనె గింజలూ, దూదీ, ఉప్పూ, పశువులూ-దేశంలో అన్నీవున్నాయి సమృద్ధిగా; కానీ వాటిని అవసరమున్న వారికి అందించటమే సమస్య.

పాకిస్తాన్‌వంటి దేశంలో రోడ్లువేయడానికి చాలా ఖర్చవుతుంది; దీనికి కావలసిన పెట్టుబడికూడాలేదు. పాకిస్తాన్‌లో ప్రజలుగానీ, సరుకులుగానీ పడవలలో ప్రయాణంచేయడం మామూలు. తూర్పు పాకిస్తాన్‌లోనే నదులలోనూ కాలువలలోనూ మూడుకోట్ల పడవ లున్నాయి. నీరున్నచోటల్లా పడవలుంటాయి. మయూరగంజి వంటి రేవును పడవల పద్మవ్యూహం అని చెప్పవచ్చు.

అక్కడ అన్నిరకాల పడవలూ వుంటాయి. ఒక ఐక్యరాజ్యసమితి రిపోర్టులో అది యీ విధంగా వర్ణింప బడింది.

"ఒక తెరచాపల పడవ, ముస్తాబైన పెండ్లి వారితో కూడా పెళ్లివారినీ యెక్కించుకొని, ఒక ఓడను దాటిపోతూవుంది. విశాలమైన తెరచాపలుగల ఒక నౌక, జనపనార కట్టలు మోసుకొంటూ నేరుగా వస్తూవుంది. ఈ సందులో దిసమొలల పిల్లలు తమ బుల్లి పడవలను అటునిటు పరుగెత్తిస్తున్నారు. మామిడి పండ్లూ, బియ్యమూ, కూరగాయలూ నిండిన పడవలను రైతులు నడుపుతున్నారు. ఒక్కొక్క తెడ్డుకు తొమ్మిదిమంది బలశాలురు గల ఒక పెద్దనావ చిన్న పడవలను త్రోసుకుంటూ వస్తూవుంది. ఇవిగాక తేలే "గోదాము"లవలె సరుకులతో నిండిన పెద్దనావ లున్నాయి. సముద్రపు రేవునుండీ వీటిని తెడ్లపడవలు యీడ్చుకొనివచ్చి జనముతో నింపి తిరిగి రేవుకు ఈడ్చుకొని పోతాయి"

అంతా కోలాహలమూ, సంరంభమూ, రంగు రంగులూ. పాకిస్తాన్ అధికార్లలో ఒక ప్రశ్న పుట్టింది; "మా సరుకులను రవాణాచేయటానికి ఇంకా మంచి మార్గాలుండవచ్చు. రోడ్లూ, రైల్వేలూ నిర్మించుకోటానికి మాకిప్పుడు శక్తిలేకపోవచ్చు. కాని ఇంకాయెక్కువ వేగంగా మోసుకుపోయే పడవలు ప్రపంచంలో యెక్కడాలేవా? నదులలో ప్రయాణాలను క్రమబద్ధంచేసే పద్ధతులులేవా?"

బర్మా, ఇండోచైనాలవారు ఈ ప్రశ్నవిని "మమ్మికూడా ఈ ప్రశ్న బాధిస్తూనేవుంది, దీనికి జవాబు తెలుసుకోవలసిన అవసరం మాకూ వుంది" అని అన్నారు.

పాకిస్తాన్ ప్రభుత్వము సూయాచ్క్‌లోని సాంకేతిక సహాయ సంస్థ ఆఫీసుకు ఒక అర్జీ పంపింది. దానిమీద "దేశాంతర్భాగంలో జలప్రయాణానికి తగిన చిన్ననౌకల నిర్మాణంలో ప్రవీణుని కొరకు పాకిస్తాన్ ప్రభుత్వముయొక్క అభ్యర్థన" అని వ్రాసి నారు.

ఒక నౌకా నిర్మాణ ప్రవీణుని పాకిస్తాన్‌కు పంపటం యేమీ కష్టమైనపనిగాదు. అట్టివానినొకని పంపినా, అతడు ఉత్తమ నౌకా నిర్మాణ పద్ధతులు పాకిస్తాన్‌లో నేర్పినా, కార్యము సంపూర్ణముగా నెరవేరదని సాంకేతిక సహాయ సంస్థకు తోచింది. నౌకలు నిర్మించడం – ఎట్టినౌకలైనా – యేమీ కష్టంగాదు. "తేలేగోదాము" అనబడే యెత్తైనపడవ – అది సులభంగా తలక్రిందు లైయేటంత యెత్తుంటుంది – దానిని నిర్మించటంమాత్రం కొంత కష్టం గావచ్చు. అసలు కష్టం కలిగించేసమస్య పడవల సంఖ్య యెక్కువైనందువలన కలిగే కల్లోలం, దిగ్భ్రాంతి.

ఈ సమస్యను పరిష్కరించటానికి సాంకేతిక సహాయసంస్థ ఒక సలహా చెప్పింది. ప్రపంచంలోని యితరదేశాలలో నదుల లోనూ, రేవులలోనూ నౌకా ప్రయాణములు యేవిధంగా నిర్వ

హింపబడుతుండేదీ కొంతమంది పాకిస్తాన్ ప్రతినిధులు పరిశీలించి వస్తే బాగుండును" అని ఆ సలహా.

త్వరలోనే లండన్, న్యూయార్కు, హాంబర్గు, బ్యూనస్ ఐర్స్ మొదలైనచోట్ల రేవు అధికారులు ఆతిథ్య మివ్వటానికి అంగీకరించగా, పాకిస్తాన్ నుండి ఒక చిన్న దళము ఆరేవులను పరిశీలించటానికి బయలుదేరింది. ఇదే సమస్యలుగల మరికొన్ని ప్రాచ్యదేశాలయొక్క ప్రతినిధులుకూడా వారివెంట పోయినారు. వారు పడవలూ, నౌకలూ, నూనెఓడలూ మొదలైనవాటి నన్నిటినీ పరిశీలించినారు; లంగరువేయటం, సామానులు యెత్తుకొనటం, దించుకొనటం, ప్రయాణ నియమాలూ అన్నీ గమనించి నారు.

తూర్పు పాకిస్తాన్ నదులలో రైతుల చిన్నచిన్న పడవలమధ్య నల్లని పెద్ద తెరచాపగల "సంపన్" లనే నౌకలూ, మామిడి పండ్లను మోసుకపోయే తెడ్లఓడలూ ప్రయాణం చేస్తున్నాయి. వీటన్నిటిమధ్యా చిన్న పిల్లలు మునుగుతూ, తేలుతూ నీళ్ళలో ఈదుతుంటారు.

సరుకులు సాగుతున్నాయి; కాని చాలా నెమ్మదిగా సాగు తున్నాయి. దేశం ఆర్థికంగా అభివృద్ధికావాలంటే సరుకులు ఇంకా వేగంగా సాగాలి. క్రొత్తగా యేర్పడిన పాకిస్తాన్, ముందు ముందు రోడ్లూ, రైళ్లూ నిర్మించుకొంటుంది. అంతవరకూ జల

ప్రవాహాలను సద్వినియోగం చేసుకోవటం సాంకేతిక సహాయ సంస్థనుండి పాకిస్తాన్ నేర్చుకుంటున్నది.

---

# 17. తాయ్‌లాండులో పరభావ సమాదరణ.

తాయ్‌లాండు, లేక సయాం, బర్మా ఇండో చైనాలమధ్య వుంది. అది సయాం సింధుశాఖకూ అండమాన్ సముద్రానికీ మధ్యన, మలయా ద్వీపకల్పమునానుకొని వుంది. ఇది బియ్యం ఎక్కువగా పండేదేశం – తూర్పు దేశాలలో బియ్యం ఎగుమతి చేయటంలో దీనికి రెండవస్థానం వుంది. కానీ ఉత్తరభాగంలో పర్వతాలూ, టేకుచెట్ల అడవులూ వున్నాయి. తాయ్‌లాండుకు విమానాలలోపోయే వారికి సూర్యకాంతికి మిలమిలలాడే బంగారు గోపురాల దేవాలయాలు కన్నులపండువుగా కనబడుతాయి.

తాయ్‌లాండు ప్రజలు తమ వంశ గౌరవానికి గర్విస్తుంటారు. వారు విష్ణుదేవుని అవతారమైన రాముని సంతతివారని ఒకగాథ వుంది.

అనేక శతాబ్దాలకు పూర్వం రాముడు ఇండియా నుండి తాయ్‌లాండుకు వచ్చెనని ఆ ప్రజలు చెప్పుతారు. ఈ కథను వారు పదేపదే చెప్పుతుంటారు. మణిమయ వస్త్రభూషణాలు ధరించిన నటకులూ, లయాను గుణంగా హస్తపాద విన్యాసాలతో నాట్యం చేసేవారూ, తెల్లని తెరలవెనుక బొమ్మలాటగాళ్ళూ – అందరూ రాముని ఆగమనమునకు సంబంధిచిన కథలనే చెప్పు

తారు. సవతితల్లి ద్వేషము రాముని, తన తండ్రి రాజ్యమునుండి తరిమివేయగా, భార్యతోగూడా అతడు అడవులు బట్టినాడు. లంకారాజ్యపు రాక్షసరాజు అతని భార్యను అపహరించుకొనిపోగా, అరణ్యములోని జంతువులతో, ముఖ్యముగా వానర సమూహముతో రాముడొక గొప్ప సైన్యమును కూర్చుకొన్నాడు. వానరులు హిమాలయ పర్వత శిఖరములను పెకలించుకొనివచ్చి సముద్రమునకు వారధికట్టినారు. ఒక రాత్రిలోనే రాముడు లంకా రాజ్యమునుచేరి, రావణుని సంహరించి, తనభార్యను రక్షించుకొన్నాడు. అక్కడినుండి అతడు విజయోత్సాహముతో తాయ్ లాండులోని అయోధ్యను జేరి సతీ సమేతంగా పట్టాభిషిక్తుడైనాడు.

ఇదంతా యెన్నడో జరిగినకథ. అయినా అయోధ్యానగరము అనేక శతాబ్దాలపాటు సర్వ వైభవాలతోనూ విలసిల్లిన ముఖ్య పట్టణం. 1776 లో బర్మాసైన్యాలు అయోధ్యను ముట్టడించి నిర్ధూమధామం చేయగా తాయ్ ప్రజలు బాంకాక్‌వద్ద మరొక ముఖ్యపట్టణం నిర్మించుకున్నారు. అనాటినుండీ దేశమును పాలించే ప్రతిరాజుపేరూ రాముడే.

బాంకాక్‌లో పాలించిన రాజులందరూ ప్రతిభావంతులే. వారు దేశ స్వాతంత్ర్యమును గోల్పోకుండా, పురాతన సాంప్రదాయాలను సజీవంగా పోషించుకుంటూ, పాశ్చాత్య పద్ధతులలోకూడా ఆసక్తి కనబరుస్తూ వచ్చినారు.

ఉదాహరణకు 1851 నుండి 1868 వరకూ పాలించిన నాల్గవ రాముడు గొప్ప బౌద్ధపండితుడు. 40 యేండ్ల వయస్సు వచ్చిన తరువాత అతడు ఇంగ్లీషు నేర్చుకొని, చరిత్ర, రాజకీయాలు బాగా చదివినాడు. ఈ రాముడే ప్రతియేటా ఒక వంతెన కట్టించి జన్మదినోత్సవం జరుపుకొనేవాడని అంటారు-బాంకాక్ నగరంలో కాలువలు అమితంగా వున్నాయి. అతడు కోటలూ, దేవాలయాలూ, రాజభవనాలూ లెక్కలేనన్ని కట్టించినాడు. ఈ విషయాలన్నిటికంటే ముఖ్యమైనది మరొకటి వుంది. అతడు ఇంగ్లాండుతోనూ, అమెరికాతోనూ సంధులు చేసుకొని, తన ప్రజలకూ యూరోపియన్ ప్రజలకూ సమానంగా న్యాయం లభింపగల న్యాయశాలలు స్థాపించినాడు.

ఈ ప్రతిభావంతుని కుమారుడే ఐదవరాముడు. ఇతడుగూడా తండ్రియంతటి ప్రజ్ఞావంతుడేగాక, తండ్రివలెనే పాశ్చాత్య పద్ధతులందు ఆసక్తిగలవాడు. తన పిల్లలకు చదువు చెప్పటానికి "తియొనోవెన్స్" అను ఆంగ్ల స్త్రీని ఆహ్వానించినదితడే. బహుశా ఆమెద్వారానే ఇతడు అమెరికాలోని తన సమకాలికుడైన అబ్రహాం లింకన్‌ను గురించి వినియుండును. ఈ రామునికీ లింకన్‌కూ మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలు ఈనాటికీ భద్రపరుపబడి యున్నవి. అమెరికాలో "అరణ్యమును అణచుటకు" ఒక ఏనుగుమందను బహూకరిస్తూ తాయిలాండు ప్రభువు జాబు వ్రాసినాడు. కానీ లింకన్ ఆబహుమానాన్ని అంగీకరించలేదు. "ఏనుగులను పెంచుకొనవలసినంత తక్కువ స్థితిలో" తాము లేమనియూ,

"అవిచ్ఛిన్నశక్తి పూరకు అత్యుత్తమైన రవాణా సాధనముగా వున్న" దనియూ లింకన్ జవాబు వ్రాసినాడు.

తన బహుమానం తీసుకోనకపోయినా లింకన్‌మీద ఐదవ రామునికి గల అభిమానం తగ్గలేదు. అమెరికాలో బానిసవిముక్తి ప్రకటన జరిగినదని తెలిసినంతటనే రాముడు తాయిలాండులోని బానిసలందరికీ స్వాతంత్ర్యం ప్రసాదించినాడు.

రామనామము ధరించిన రాజులందరూ ఇదేవిధంగా పరిపాలించినారు. ప్రాచ్య సంప్రదాయాలకు వారు యెల్లప్పుడూ బద్ధులే; పాశ్చాత్య పద్ధతులందు యెల్లప్పుడూ ఆసక్తులే.

1932లో ప్రభుత్వ యంత్రాంగంలో కొన్ని ప్రజాస్వామిక పద్ధతులు ప్రవేశపెట్టబడినాయి; కానీ ప్రజల కిందువలన వొరిగిందేమీలేదు. రెండవ ప్రపంచ యుద్ధంలో బాంబులూ మృత్యు తాండవమూ వారిని యెదుర్కొన్నాయి. ఆగ్నేయ ఆసియాలోని అన్నిదేశాలతోపాటూ, తాయిలాండుకూడా ఐదు దీర్ఘసంవత్సరాలు జపాను అధికారాన్ని భరించింది. జపాన్ ప్రభుత్వం పోయిన తరువాత రాచరాజ్యం తిరిగి ప్రారంభమైంది. 1946లో యువకుడైన ఎనిమిదవ రాముడు నిగూఢ హంతకుని చేతిలో దుర్మరణం పొందగా, అతని తమ్ముడు స్విట్జర్‌లాండునుండి తన విద్యాభ్యాసమును వదలిపెట్టి వచ్చి తొమ్మిదవరాముడుగా రాజ్యపాలనం ప్రారంభించినాడు. తళతళ మెరిసే దేవాలయాలతోనూ,

కష్టపడి పనిచేసేవారూ, శాంత స్వభావులూ, నిత్య ప్రసన్నులూ అయిన ప్రజలతోనూ, కాషాయ వస్త్రాలు ధరించి, భిక్షాపాత్రలు చేతబట్టుకొని నెమ్మదిగా వీధులవెంటపోయే బౌద్ధ భిక్షుకులతోనూ, థాయ్‌లాండు పూర్వంమాదిరే వుంది.

ముఖ్యనగరమైన బాంకాక్‌లో "ఫ్రాకేవ్" అను గుడిలో ముత్యాలుతాపిన ద్వారములవెనుక మరకత బుద్ధుడు ఆసీనుడై వున్నాడు. నిజానికి ఈ విగ్రహమంతా మణితో చేయలేదు; స్వచ్ఛమైన "జాస్పర్" అను ఖనిజముచే చేయబడినది. ఈ విగ్రహమునిండా బంగారు ఆభరణాలూ, చుట్టూ రకరక దేవతా విగ్రహాలూ వున్నాయి. సంవత్సరానికి మూడుసార్లు – వేసవి, వర్షాకాలం, చలికాలం, ఈ మూడు కాలాల ఆరంభంలో – ఆ విగ్రహానికి క్రొత్త జరీ దుస్తులు కట్టుతారు. బాంకాక్‌లో ఇంకా మూడువందల దేవాళయాలున్నాయి; అన్నీ అందంగా, ఆకర్షణీయంగా, గాజు, పింగాణీల పనితనంతో మెరుస్తూ వున్నాయి.

పూర్వాచారాలు అమలులో వుండేది దేవాళయాలలోనే గాదు. రాజమందిరంలో ప్రతి చిన్నపనీ పురాతన సాంప్రదాయ బద్ధంగానే చేస్తారు. ఇప్పుడున్న రాజు తొమ్మిదవరామునికి కుమారుడు కల్గినప్పుడు, శిశువు తల వెంట్రుకలను ఆచారానుగుణంగా రాజు కత్తిరించగా, ఆ వెంట్రుకలను ఒక పురోహితుడు వెండి గిన్నెలో భద్రపరచినాడు.



ఐక్యరాజ్యసమితి నిపుణుల సహాయంతో, థాయిలాండు ప్రభుత్వం దేవాలయ ప్రాంగణాల్లో ఆధునిక పాఠశాలలు స్థాపించింది. ఈ చిత్రంలో చెంగ్ మాయ్ పట్టనున్న బుద్ధదేవాలయంలోని పాఠశాల విద్యార్థులను డాక్టర్ ఉద్దామ్ పరీక్షచేస్తున్నారు.

నాటక రంగాలలోకూడా పూర్వ సంప్రదాయాలే రాజ్యం చేస్తున్నాయి. రాముని చరిత్రా, రాముని సాహస కార్యాలూ నటించే నర్తకులు ఆ కళలో చిన్నతనమునుండి శిక్షణపొంది వుంటారు. వారి నృత్యమును చూచిన పాశ్చాత్యులు వారి రత్న ఖచితమైన వస్త్రములగురించీ, వెనుకకు వంచితే మణికట్టుకు తగిలే నాజూకైన చేతివ్రేళ్ళను గురించీ, ఆశ్చర్యపడుతూ వుంటారు.

ఈ విధంగా పురాతన పద్ధతులు అనుసరింపబడేవి దేవాలయాలలోనూ, రాజ భవనాలలోనూ, నృత్య రంగాలలోనూ, మాత్రమేగాదు. పురాతన నియమాల ప్రకారమే మళ్ళలో వరి నాటుతారు, కృతయుగంనాటి మడకలతో దున్నపోతులను గట్టి మళ్ళలో సేద్యము చేస్తారు; ఉత్తరాన పర్వతాలలో టేకు మొద్దులను నదులలో చేర్చునట్లు ఏనుగులకు శిక్షణ యిస్తారు.

ఇవన్నీ పాతపద్ధతులలో జరుగుతున్నా, కొత్త విషయాల మీదా, పాశ్చాత్య పద్ధతులమీదా ఆసక్తి కనబడుతూనే వుంది. "తాయ్‌లాండు" అనగా స్వతంత్రులదేశం అని అర్థము. ఈ స్వతంత్రజాతి ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతులలోని ఉత్తమ గుణాలను సంగ్రహించుకొన్నందుకు గర్విస్తున్నది. కొంత కాలముక్రింద అమెరికాలోవున్న తాయ్‌లాండు రాయబారి ఈ విధంగా అన్నాడు. ప్రాచ్యదేశాలలో "పరదేశీయ సమాదరణ పద్ధతి"ని గురించి విరివిగా చర్చిస్తుంటారు. కాని తాయ్‌లాండులో

మాకు "పరభాష సమాచరణా పద్ధతి"ని అనుసరించుటలో యెక్కువ అభిలాషవుంది.

ఈవిధంగా తాయ్‌లాండు కొత్త భావాలను నిష్పాక్షిక బుద్ధితో ఆదరించింది. బాంకాక్ వీధులలో విద్యుద్దీపాలున్నాయి, కాని సగం పక్షి, సగం మనుష్య ఆకారంగల విచిత్ర విగ్రహాలు ఆ దీపాలను పట్టుకొన్నట్లు అమర్చినారు. రేడియోలు, రెఫ్రిజిరేటర్లు టైపురైటర్లు, మోటారుకార్లు అమ్మే యూరపియన్ వ్యాపారస్తులనూ ఆహ్వానించినారు; సిల్కు, జరీ గుడ్డలు అమ్మే భారతీయ వ్యాపారస్థులూ, కోళ్లూ మాంసమూ కూరగాయలూ అమ్మే చైనా రైతులూ మార్కెట్‌లో వున్నారు. పురాతన జాతీయ నాటకాలతోబాటు అమెరికన్ సినిమాలనూ ప్రజలు చూస్తుంటారు. "పెనంగ్" అనే జాతీయ దుస్తులకు బదులు పాశ్చాత్య దుస్తులు క్రమంగా అమలులోకి వస్తున్నాయి. స్త్రీ పురుషులందరూ దొరటోపీలు ధరించవలెనని శాసనం చేయబడింది గానీ అమలులోకి రాలేదు.

తమ పురాతన దేశాన్ని అధునికం చేయటానికి తాయ్‌లాండు ప్రభుత్వనాయకులు యెంత ప్రయత్నించినా, ప్రజలందరూ విద్యావంతులైతే తప్ప తమ ప్రయత్నాలు నెరవేరవని వారికి తెలుసు. ఆరోగ్య సూత్రాలనూ, క్రొత్త వ్యవసాయ పద్ధతులనూ, తమ శ్రమ ఫలితాలను సద్వినియోగం చేసుకునే విధానాలనూ, ప్రజలు యేవిధముచేతనైనా నేర్చుకొని తీరవలెను. చదువనూ, వ్రాయనూ వోట్లువెయనూ ప్రజలు నేర్చుకొనవలెను. 1936లో తాయ్‌లాండు

ప్రభుత్వం సార్వజనీన విద్యాశాసనం ఒకటి చేసింది గాని అది అమలులోకి రాలేదు. తగినంతమంది ఉపాధ్యాయులూలేరు, ఉపాధ్యాయులకు శిక్షణ యెట్లివ్వవలెనోకూడా యెవరికీ తెలియదు. ఒక విద్యా విధానమును తయారు చేసుకోవలెనని యెంత ఉబలాటమున్నా, అదియెట్లు తయారుచేసుకోవలెనో వారికి తెలియదు. అందువలన దేవాలయ ప్రాంగణాలలో కాషాయ వస్త్రాలు ధరించిన సన్యాసులు విద్యార్థులతో పూర్వ కావ్యాలను వల్లె వేయించటం తప్ప తాయిలాండులో వేరె విద్యలేదు.

1950 నవంబర్ నెలలో తాయిలాండు ప్రభుత్వం సాంకేతిక సహాయ సంస్థకు ఒక అర్జీ పెట్టుకుంది. "విద్యాభివృద్ధికి ఒక దశవర్ష ప్రణాళికను తయారుచేయుటకూ, దాని ప్రథమ దశను ప్రారంభించి ఆచరణలో పెట్టుటకూ" నిపుణులు కావలెనని ఆ అర్జీ కోరింది. క్రొత్త ప్రణాళికను ప్రారంభించటానికి ఒక న్యూజీలాండు నిపుణుడు వెంటనే తాయిలాండుకు పోయినాడు.

మార్పులను ప్రవేశపెట్టేటప్పుడు, అవి ఉట్టిపాటుగా వుండకూడదు. అందుకని సాంకేతిక సహాయసంస్థ బాంకాక్‌కు 60 మైళ్ళ దూరంలో వున్న చా-చోయుంగ్-సాయ్ అను చిన్నపట్టణంలోని ఒక పురాతనదేవాలయ ప్రాంగణంలోనే తన మొదటి పాఠశాలను ప్రారంభించింది. కానీ ఇక్కడ నేర్పేవిద్య అధునాతనమైనది. విద్యార్థులు విద్యకొరకు పాతస్థలానికే వచ్చినా, నేర్చుకొనేవిద్య కొత్తది.

ఈ పాఠశాల ప్రారంభించకముందు ఐక్యరాజ్యసమితి కొన్ని సమావేశాలు యేర్పాటుచేసి ప్రజల నందరినీ ఆ సమావేశాలకు ఆహ్వానించింది. ఏమి జరుగుతుందో చూడవలెననే ఉత్సుకతో ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చినారు. తమ చింపిరి కొంపలవలెగాక చక్కని మాడల్ గృహములూ, చిన్న పిల్లల క్రీడా స్థలములూ, ప్రజలు అక్కడ చూచినారు. అటు వంటివి వారింతకుముందెన్నడూ చూడలేదు. సమావేశ స్థలములో ఒకప్రక్క శిశుపోషణలో క్రొత్త పద్ధతులను నేర్పించే శిశు ఆరోగ్య కేంద్రమూ, మరొకప్రక్క క్రొత్త మగ్గాలూ, క్రొత్త రకం కుండలూ వుండినాయి. ఒకచోట క్రొత్త వ్యవసాయ పనిముట్లూ, మరొకచోట క్రొత్త సంగీత సాధనాలూ ప్రదర్శింపబడినాయి.

ఈ విషయాలనుగురించిన వార్త త్వరత్వరగా ప్రాకింది. అన్నిదిక్కులనుండీ ప్రజలు చా-చోయంగ్- సాయ్‌కి వచ్చినారు. న్యూజీలాండు నిపుణునికి సహాయపడటానికి డెన్మార్కునుండి ఒక ప్రాథమిక విద్యానిపుణుడూ, ఇంగ్లాండునుండి ఒక వృత్తి విద్యానిపుణుడూ, అమెరికానుండి ఒక శాస్త్ర విద్యా నిపుణుడూ వచ్చినారు.

కొలదికాలంలోనే ఈ పాఠశాలలో పిల్లలూ పెద్దలూ చదువు మొదలుబెట్టినారు. వారి పాఠ్యపుస్తకాలు తాయ్‌లాండు భాషలో ప్రత్యేకముగా వ్రాయింపబడినాయి. వాటిలో తాయ్‌లాండు

కళాశాలలు గీసిన పరిచిత వస్తువుల బొమ్మలుకూడా వుండినాయి. ఇంకా చదువురానివారు యిసుకపోసిన మేజాలమీద మాడల్ వ్యవసాయ క్షేత్రాలూ, నీటిపారుదల విధానాలూ నిర్మిస్తుంటే వారికి ఒక ఉపాధ్యాయుడు క్రొత్త వ్యవసాయ పద్ధతులు నేర్పుతూవుండినాడు. తామెన్నడూ యెరుగని రంగులూ రంగు పెన్సిళ్లూ చూచి పిల్లలూ పెద్దలూ చాలా సంబరపడినారు.

ఇట్లు అనేక మార్గాలలో ప్రజలు విద్యార్జన ప్రారంభించినారు. నబ్బునుగురించి మట్టిని గురించీ ఇసుకనుగురించీ వారు నేర్చుకొన్నారు. సగంమరచి పోయిన పురాతన వృత్తులనుగూడా వారు మరలా నేర్చుకొన్నారు.

చా - చోయెంగ్ - సాఘ్‌నుండి ఈ క్రొత్త భావము ఇతర చోట్లకు వ్యాపిస్తుంది. తాయిలాండులో నాలుగుదిక్కులా ఇటువంటి క్రొత్త పాఠశాలలను నడపడానికి క్రొత్త ఉపాధ్యాయులు సిద్ధమౌతారు.

ఇంతలో రామునిసంతతివారు బియ్యం పండిస్తుంటారు; టేకుమొద్దులు నదులవెంబడి నిదానంగా వస్తూంటాయి. బాంకాక్‌లో మహాదుపండల దేవాలయాల స్వర్ణగోపురాలు సూర్యకాంతిలో తళతళమంటుంటాయి; కాషాయాంబరధారులైన బౌద్ధ భిక్షువులు తమ భిక్షా పాత్రలతో యింటింటికీ తిరుగుతూ వుంటారు.

ఈ విధంగా కొత్తపాతలు మేళవిస్తున్నాయి. ఐక్యరాజ్య సమితి కృషివల్ల తాయ్‌లాండు ప్రజలలో క్రొత్త ఉత్సాహమూ ఆత్మవిశ్వాసమూ వెల్లివిరుస్తున్నాయి.

---

# 18. ఫిలిపైన్ దీవులలో మగ్గాలు.

హాంకాంగ్‌నుండి చైనా సముద్రంద్వారా సింగపూర్‌కు ఓడలో ప్రయాణించేస్తే, ఫిలిపైన్ దీవులు నీకు యెడమ ప్రక్కన వుంటాయి. పచ్చనిచెట్లుగల మీరభూములను గంట గంటకూ ఓడ దాటిపోతూనే వుంటుంది; ఆదీవులన్నీ పర్వత మయమే.

ఫిలిపైనులను గురించి చెప్పవలసిన విషయాలు యెన్నైనా వున్నాయి—స్పెయిన్ అమెరికాల యుద్ధానంతరం వాటిని స్పెయిన్ 2 కోట్ల డాలర్లకు అమ్మివేసింది; సుమారు 50 సంవత్సరాలపాటు వాటిని అమెరికా పాలించింది; 1946లో అవి స్వతంత్రమైనాయి; ముఖ్యపట్టణమైన మనిలాలో ఒక ఆధునిక ఆసుపత్రీ, వైద్య కళాశాలా, న్యాయకళాశాలా వున్నాయి; మనీలావీధులలో చిన్న రెండుచక్రాల బండ్లనుతోలె మనుష్యులకు ఒకవిధమైన సిల్కు బట్టలు – పూలుకుట్టినవి – వున్నాయి: నీలోత్పలాక్షులైన సుంద రాంగులకు విశాలమైన పావడాలూ, సీతాకోకచిలుక చేతులుగల రవికెలూ వున్నాయి.

ఫిలిపైన్‌దీవులను గురించి అనేక విషయాలు చెప్పవచ్చు. కానీ అన్నిటికంటే ముఖ్యమైన విషయమేమంటే ఆ పచ్చని దీవు

లలోని కోటీ అరవైలక్షలమంది ప్రజలలో నూటికి తొంభైమంది వ్యవసాయంమీదనే బ్రతుకుతున్నారు. బియ్యమూ, చక్కెరా, ధాన్యమూ, పొగాకూ, నారా వారి ముఖ్యమైనపంటలు. వీటిని పండించటం లాభకరంగా వుండవలసిందే, యెందుకంటే ఆ ప్రజలకు అమెరికాతో వ్యాపార ఒడంబడికలు వున్నాయి; అవనవు పంటలను ఆసియాలోని దేశాలకు ఎగుమతిచేయవచ్చు. కానీ యేపంటయినా అతివేగంగా, అతి సమృద్ధిగా పండే శీతోష్ణస్థితీ, భూసారమూ - ఇవే వ్యవసాయంలో లాభంలేకుండా చేస్తున్నాయి. రైతులు ఏ పైరునైనా నాటి సంరక్షించుకుంటే మూడునాలుగు నెలలలో పంట కోతకు వస్తుంది. కానీ ఇంతలోనే భూమి నిస్సార మౌతూవుంది. అతితేమా, అత్యుష్ణమూ కలిసి భూమిమీదవున్న పండుటాకులూ చెత్తా చెదారమూ వగైరాలను కొలదిదినములలోనే సంపూర్ణముగా కుళ్ళునట్లుచేసి కుళ్ళుయెరువును శీఘ్రముగా రూపు మాపుతాయి. అందువలన భూమిలో నత్రజని లోపిస్తూ వుంది. భూమిలోవున్న అంతో యింతో సారము వర్షాకాలంలో అతివృష్టికి కొట్టుకొనిపోతుంది. యెరువునిచ్చే పశువులుగానీ రసాయనిక యెరువులను తెచ్చుకొనే మార్గాలుగాని లేవు. అందు వలన చచ్చిబ్రతికి రైతు సంవత్సరానికి ఒక పంట పండిస్తాడు. ఆ పంటలో భూస్వామికి కొంతభాగం పోతుంది.

సంవత్సరానికి ఒక పంట అంటే మూడునాలుగు మాసాల పని అన్నమాట. తక్కిన ఎనిమిదిమాసాలూ రైతుకు యేమీ పని వుండదు. కానీ మూడు నాలుగు మాసాలకృషి మీదనే

ఆతడు సంవత్సరమంతా బ్రతుకవలెను; సంవత్సరమంతా బ్రతక టానికి తగిన పంట అతనికి యేనాడూ పండలేదు.

అంతేగాదు, ఫిలిప్పైన్‌దీవులలో ప్రతి ఐదుగురు స్త్రీలలోనూ ఒక విధవ వున్నది; తనకూ తన కుటుంబానికీ తానే ఆధారం. రెండవ ప్రపంచయుద్ధమూ, జపాన్ ఆక్రమణా ఈ పచ్చని దీవు లలో అనేక పురుషులను బలిగొన్నాయి.

ఫిలిప్పైన్ ప్రభుత్వంయొక్క అభ్యర్థన ఫలితంగా, ఆ దీవుల లోని పరిస్థితి పరిశీలించడానికి సాంకేతిక సహాయసంస్థ ఒక సలహాదారుని పంపింది. ఫిలిప్పైన్ ప్రజలకు కావలసినది వస్తు సహాయం కాదని చూస్తూనే తెలుస్తూవుంది. వారికి కావలసింది చక్కనిపని చేయుటకు అవకాశం; రైతులను పనిలేనికాలంలో చేయుటకుతగినపని చూపించటం, స్త్రీలకుకూడా సంపాదించుకొనుటకు తగిన అవకాశం యివ్వటం.

యుద్ధానికి పూర్వం ఫిలిప్పైన్ దీవులలో గృహ పరిశ్రమలు ఉచ్ఛస్థితిలో వుండేవి. అల్లికపని, చెక్కపని, కుండలు చేయటం, బట్టలునేయటం ఈ విధంగా యేదో ఒకపని గ్రామాలలో ప్రతి యింటిలోనూ సాగుతూ వుండేది. చేతిపనులలో అందమూ నైపుణ్యమూ ఆ ప్రజలకు వంశ పారంపర్యంగా వచ్చిన గుణాలు. వారు తయారుచేసిన వస్తువులను వ్యాపారస్థులు అక్కడనే డబ్బిచ్చి కొని, మనీలాకు తీసుకొనిపోయి,

అక్కడనుండి విదేశాలకు, ముఖ్యంగా అమెరికాకు ఎగుమతి చేసేవారు.

కానీ కాలంతో బాటు అభిరుచులు మారుతాయి. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఈ వస్తువులకు అమెరికాలో గిరాకీ తగ్గిపోయింది; క్రమంగా పూరిగుడిసెలలోని మగ్గాలకు పనిలేకుండా పోయింది; అల్లికపని చేసే సూదులు మూలబడినాయి; కుమ్మరి సారెలు తిరగడం మానుకొన్నాయి.

ఈ పరిస్థితిని గమనించిన ఐక్యరాజ్యసమితి సలహాదారుడు ఈ విధంగా సలహా చెప్పినాడు: "గృహ పరిశ్రమలను మనం పునరుద్ధరించాలి. కుమ్మరపనీ, వడ్రంగమూ, అల్లికపనీ, చేనేతా వీటినన్నిటినీ పునరుద్ధరించాలి. నాజూకైన పూర్వకళా కౌశలాలను ప్రజలు మరచిపోకుండా చేయాలి. ఈ చేతిపనులకు గిరాకీ యేర్పరుపగలిగితే, ఈ దీవులలోని ప్రజలందరికీ ఉద్యోగం లభిస్తుంది."

మొదట చేనేత పునరుద్ధరణ స్వల్ప పరిమాణంలో ప్రారంభించటానికి తీర్మానమైంది. ఫిలిపైన్ ప్రజలకు సహాయం చేయడానికి నేతపనిలో ప్రవీణురాలైన ఒక అమెరికన్ మహిళ పంపబడింది. ఆమె ఉత్తరఫిలిపైన్ దీవులలోని చేనేత గ్రామాలకుపోయి కొన్ని ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకొంది.

యుద్ధంలో తమ మగ్గాలు చాలాభాగం నాశనమైనాయని అక్కడి ప్రజలు ఆమెకు తెలిపినారు. మిగిలిన మగ్గాలపైనే వారు కొంతవరకవా బట్టలునేస్తూ వచ్చినారు. ఆ బట్టలు రంగు పోతాయి అని వ్యాపారస్తులు చెప్పినారు. తమకు దొరికే రంగులు అటువంటివే అని ప్రజలన్నారు.

తరువాత ఐక్యరాజ్యసమితి ప్రవీణురాలు తనకృషి ప్రారంభించింది. ఆమె మనీలా నగరంలోని ప్రభుత్వ నూలు మిల్లుకు పోయి కొన్ని రకాలనూలు నమూనాలు తీసుకొని వచ్చింది. ఇటు వంటినూలు మీరు విరివిగా తయారుచేయగలరా? అని ఆమె గ్రామస్థులను అడిగింది. తయారుచేయగలమని వారు చెప్పినారు.

తర్వాత ఆమె "కాన్వాస్" గుడ్డను విరివిగా ఉపయోగించే ఒక వెదురు కుర్చీలను తయారుచేసేవాని కొరకు మనీలాకుపోయి "ప్రజలకు ప్రీతి పాత్రములైన రంగులేవి?" అని అతని నడిగింది. అతడు "నాకు దేశవాళీగుడ్డ పనికిరాదు. అది వెడల్పు తక్కువగా వుంటుంది. నాకు ముప్పైమూడంగుళాల వెడల్పున్న గుడ్డ కావలెను. కానీ ఇక్కడ తయారయ్యేగుడ్డ యిరవైరెండంగుళాలు మాత్రమే వుంటుంది. అదిగాక నాకు 30 గజాలు, 50 గజాలు వుండే గుడ్డ కావలసివుంటే వీరు నేసే గుడ్డకు ఒక నిర్ణీతమైన పొడవుండదు" అని చెప్పినాడు.

ఆ ప్రవీణురాలు తిరిగి గ్రామాలకు పోయింది. నేస్తేళ్ళవాతో

"మీకు సరియైన మందమూ, పురీ, గల నూలు యిస్తాము. గట్టి చాయగల రంగులూ యిస్తాము. వెడల్పుగల గుడ్డకు మంచి గిరాకీ వున్నది గాబట్టి మీరు 33 అంగుళాలు వెడల్పున్న గుడ్డను తయారు చేయాలి" అని చెప్పింది.

నేసేవాళ్ళు నిరుత్సాహంగా "మా మగ్గాలలో 22 అంగుళాల బట్టమాత్రమే తయారవుతుంది" అని అన్నారు.

ఆమె యెంతో ఓర్పుతో వారిమగ్గాలను వెడల్పుచేసె పద్ధతిని చూపించింది. అందుకయ్యేఖర్చు ఒక మగ్గానికి ఒక్క డాలరు మాత్రమే.

కొత్త మగ్గముమీద పనిచేయటానికి చేతులు పొడవుగా వుండాలి. కానీ ఆ ప్రజలందరూ పొట్టివాళ్ళూ, అల్పకాయులూ. అందుకని ఆ ప్రవీణురాలు ఒక స్త్రీని "దీనితో పని చేయటానికి మీకు చేతులందుతాయా" అని అడిగింది.

"పరవాలేదు" అని అంటూ ఆస్త్రీ వెంటనే ఆ మగ్గముమీద పనిచేయుటానికి ఉద్యుక్తురాలైంది.

"ఇంకొక్క విషయం. మీరు తయారుచేసే బట్టల తానులు అన్నీ ఒకే పొడవు ఎందుకుండవు? కొన్ని పొడవూ కొన్ని కురచా యెందుకు తయారుచేస్తారు." అని నిపుణురాలు అడిగింది.

అసలు కారణం అప్పుడు బయట పడింది. నేసేవాళ్ళు సంసారం జరుగుతున్నట్లుగా బట్టలు నేస్తూవుంటారు. డబ్బు కావలసిన రోజు తయారయిన గుడ్డను కత్తిరించుకొనిపోయి అమ్ముకుంటారు. అందువలన ఆ తానులు ఒక నిశ్చితమైన పొడవుండవు.

"మగ్గాలు సంపూర్ణంగా తయారయ్యేవరకూ మీకు వసతి సౌకర్యాలు యేర్పాటుచేస్తా" మని ఐక్యరాజ్యసమితి ప్రతినిధులు హామియిచ్చింది.

దానిమీదట మగ్గాలు ఆడటం ప్రారంభమైంది. తయారైన నమూనాలను చూసి కుర్చీల ఉత్పత్తిదారుడు చాలా సంతృప్తిపడి వెంటనె వెయ్యిగజాల గుడ్డకు ఆర్డరు యిచ్చినాడు. కొన్ని నమూనాలు అమెరికాకు పంపబడినాయి. అక్కడనుండి ఇంకా యెక్కువ ఆర్డర్లువచ్చినాయి. ఈ విధంగా ఉత్తర ఫిలిపైన్ దీవులలొ యెక్కడచూచినా మగ్గాలు పనిచేయటం ప్రారంభమైంది. చేనేత గ్రామాలన్నీ తిరిగి కళకళ లాడుచున్నాయి.

ఫిలిపైన్ ద్వీప సముదాయములోని దక్షిణ దీవులలో, ముఖ్యంగా "పనాయ్" అనే దీవిలో, ఇంకొక రకమైన నేతపని అమలులో వుండేది. ఇక్కడ "పిన్యా" అను సల్కుగుడ్డ తయారవుతుండేది. ఇది పాతెపురుగుదారాలవలె సన్నగా మెత్తగా వుంటుంది. యుద్ధానికి పూర్వం ఈ గుడ్డల వ్యాపారం బాగా సాగుతుండేది. ఫిలిపైన్‌స్త్రీలు ఈ పిన్యాగుడ్డలతో రకరకాల

దుస్తులు, అనేక మడుపులూ అలంకారాలూగలవీ, సీతాకోకచిలుక చేతులుగలవీ తయారు చేసుకొనేవారు. పురుషులుగూడా దీనితో చొక్కాలు కుట్టించుకొనేవారు.

కానీ ఫాషన్‌లు క్షణికమైనవి. అనేక యితర దేశాలలో వలెనే యిక్కడగూడా స్త్రీలు దేశీయ వస్త్రాలను విడిచిపెట్టు తున్నారు. ఫ్రాన్సు, స్పెయిన్, అమెరికా దేశాలనుండి వచ్చిన బట్టలు ధరించడం ఈనాడు నాజూకుగా యెంచబడుతూవుంది. పురుషులు బెర్నో చొక్కాలనే ధరిస్తున్నారు గానీ, చొక్కాలకు యెక్కువగుడ్డ పట్టదు. పూర్వంవలె మడుపులూ వెడల్పైన చేతులూగల దుస్తులు యీనాడు యెవరూ అభిలషించరు.

"దేశీయదుస్తులు చాలా అందంగా వున్నాయి. వాటిని వదలి పెట్టవలసిన అవసరమేమీలేదు" అని ఐక్యరాజ్యసమితి నిపుణు రాలు అనుకొన్నది.

అందుకని ఆమె మనిలాలో ఒక వస్త్రప్రదర్శన యేర్పాటుచేసి ముఖ్యమైన దర్జీవాళ్ళనందరినీ ఆహ్వానించింది. ఫిలిప్పైన్ దీవులలో రెడీమేడ్ దుస్తులను యెవరూ ఉపయోగించరు. దర్జీలందరూ బెర్నో గుడ్డను సిఫారస్‌చేస్తే ఫిలిప్పైన్ స్త్రీలందరూదానినే ధరిస్తారు.

తరువాత కొన్నాళ్ళకు అమెరికా రాయబారి భార్య బెర్నోతో ఒక గౌను కుట్టించుకొని ఒక ముఖ్యమైన విందుకు పోయింది.

దానిని చూచినప్పటినుండీ స్త్రీలకందరికీ దానిమీద మనసు పోయింది. అందమైన ఆ సిల్కు గుడ్డకు తిరికి గిరాకీ యేర్పడింది.

మనీలాలోని దర్జీలు "మాకు 36 అంగుళాల వెడల్పుగుడ్డ కావాలి. ఇంకా ఆకర్షణీయమైన రంగులలో వుండాలి" అని కోరినారు.

"అట్లేయిస్తాము. ఉత్తర దీవులలో చేసినట్లే యిక్కడ గూడా మగ్గాలు విశాలం చేస్తాము. రంగులు మీకు యేవికావలెనో చెప్పండి" అని నిపుణురాలు జవాబు చెప్పింది.

అదేవిధంగా మగ్గాలు వెడల్పు చేయబడినాయి. అందమైన పెర్నాగుడ్డలవార్త అమెరికాకుగూడా ప్రాకింది. విదేశాలనుండి కూడా ఆర్డర్లు వచ్చినాయి.

మొన్న మొన్నటి వరకూ పచ్చని ఫిలిప్పైన్ దీవులలో పురుషులూ, స్త్రీలూ, వారి కుటుంబాలూ ఆకలితో అలమటిస్తూ వుండినారు. పండ్రెండు సంవత్సరం పొడుగునా చాలేదికాదు. తమ పిల్లలను యెట్లు పోషించుకొనవలెనా అని స్త్రీలు దిగులుపడుతూ వుండిరి. కానీ యీనాడు మగ్గాలు టకటక శబ్దంచేస్తున్నాయి; ఆసుకొయ్యలు అటునుండియిటు, యిటునుండి అటు పరుగెత్తుతున్నాయి. తమ చేతి వృత్తులను అభివృద్ధి చేసుకోటానికి, ఉత్పత్తి అయిన వస్తువులను అమ్ముకోటానికి ప్రజలు నిపుణుల

సలహాలు కోరినారు. ఈ సలహాలు ఐక్యరాజ్యసమితి యొక్క సాంకేతిక సహాయసంస్థ అందించింది. ఈ సంస్థ యితర ఫిలిప్పైన్ చేతిపనులకుగూడా యిదేసహాయం చేయవచ్చు.

---



ఫిలిప్పైన్ దీవులలో చేనేత, కుండలు చేయడం, కొయ్యబొమ్మలు చేయడం వంటి సగం మరచిపోయిన చేతిపనులు ఐక్యరాజ్యసమితి సహాయంతో పునరుద్ధరింపబడుతున్నాయి. ఈ చిత్రంలో బాయీసతి అను చేనేత కార్మికురాలు కండెను వేగంగాత్రిప్పగల ఒక క్రొత్త సాధనం అమర్చిన రాట్నంతో నూలు వడుకుతున్నది. విద్యుచ్ఛక్తి వుంటే ఆమె మరింవేగంగా పనిచేయగలిగేది.

# 19. మరపురాని మన యుగం.



ఏటేటా విజ్ఞాన నిధి పెరుగుతూ వుంది. ఏటేటా క్రొత్త దేశాలు తమ అనుభవాన్నీ, కౌశలాన్నీ, ఈ నిధికి సమర్పిస్తున్నాయి. ఈ నిధిని పోషించేది పాశ్చాత్య దేశాలు మాత్రమేగాదు. ఒక చిన్న బడుగుదేశంకూడా తనకున్న సమస్యలవంటి సమస్య యెదురై నప్పుడు, దానిని అర్థంచేసుకొని సలహా యివ్వటం అప్పుడప్పుడూ జరుగుతుంది. వరిమళ్ళలో చేపలు పెంచటం జావా ప్రజలకు తప్ప యితరులకు యెవరికీ తెలియదు. పురాతన ప్రాచ్య సంప్రదాయాలతో పాశ్చాత్య పద్ధతులను మేళవించటం తాయ్‌లాండు ప్రజలకు తప్ప యితరుల కెవ్వరికీ అంతబాగాతెలియదు.

కానీ పాశ్చాత్య దేశాలలో సాంకేతిక పరిజ్ఞానం దండిగా వుంది. ఫ్యాక్టరీలకూ, నదీజల ప్రణాళికలకూ, రవాణా విధానాలకూ సంబంధించిన విజ్ఞానమంతా పాశ్చాత్యులదే. ప్రపంచాన్ని పీడించే అనేకరోగాలను నిర్మూలించగల డి.డి.టి., పెన్సిలిన్ మొదలైన మందులను కనిపెట్టినది పాశ్చాత్య శాస్త్రజ్ఞులే.

బడుగుదేశాలకు శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానం అందివ్వ టంలో పాశ్చాత్యదేశాలు ధర్మకార్యమేమీ చేయటంలేదు; ఆత్మ సంరక్షణ మాత్రమే వారు చేసుకుంటున్నారు. శీఘ్రగమనంగల

ఓడలూ, విమానాలూగల యీనాడు ఆకలీ, అజ్ఞానం, వ్యాధులూ, వీటివల్ల యేమూల అశాంతి ప్రబలినా అది అంటురోగంవలె ప్రపంచమంతా వ్యాపించి, ప్రపంచయుద్ధంగా పరిణమించి మనల నందరినీ కబళింపవచ్చు.

ఒకప్పుడు - చాలా యేండ్లక్రిందటగూడాగాదు - పాశ్చాత్య ప్రభుత్వాలు తక్కిన ప్రపంచాన్నంతటినీ తమ పాదాక్రాంతం చేసుకొని, దక్షిణఅమెరికాలోనూ, మధ్యప్రాచ్యంలోనూ, ఆసియా లోనూ వలసరాజ్యాలను స్థాపించడానికి ప్రయత్నం చేస్తుండేవి. "ఈ దేశాలలో సహజ సంపదవల్ల మేము ఐశ్వర్యవంతుల మౌతాము. ఈ దేశాలలోని ముడిసరుకులను మా దేశాలలో పారిశ్రామిక వస్తువులుగా మార్చి తిరిగి ఈ దేశాల ప్రజలకే అమ్ముతాము" అని పాశ్చాత్యులు అనేవారు. కానీ ఈవ్యాపార పద్ధతి అపజయం పొందింది. అమెరికాలోని వలస రాష్ట్రాలె మొదట ఈ పద్ధతిని యెదిరించి ఇంగ్లాండుతో యుద్ధంచేసి స్వాతంత్ర్యం సంపాదించుకొని నేటిఅమెరికా సంయుక్త రాష్ట్రాలుగా రూపొందినాయి.

ఈనాడు - మన కాలంలో - ప్రతి చిన్నదేశమూ లేని స్వాతంత్ర్యాన్ని పొందడానికో లేక ఉన్న స్వాతంత్ర్యాన్ని నిలుపు కోడానికో ప్రయత్నం చేసేదే. ఫిలిప్పైన్ దీవులూ, ఇండోనీషియా, ఇండియా, పాకిస్తాన్, ఈజిప్టు, లిబియా - ఇవన్నీ ఇతర దేశాలతో వచ్చి పుచ్చుకోడానికీ, ప్రపంచ జీవితంలో భాగస్వాములుగా

వుండటానికి సిద్ధంగావున్న స్వతంత్రదేశాలు. ఈ దేశాలలో చాల వాటిలో దారిద్ర్యమూ, ఆకలీ, బాధా తాండవిస్తున్నాయి. కాని ఐక్యరాజ్యసమితిద్వారా వీటి నెదుర్కోవచ్చునని ఈ దేశాలనాయకు లెఱుగుదురు.

ఈ యెఱుక మలయ పవనంవలె ప్రపంచమంతా వ్యాపిస్తున్నది. బడుగుదేశాల ప్రజలు "మాకు యెన్నో తరాల విజ్ఞానాన్వేషణ తప్పిపోయింది. మా కృషిలో యింక వ్యర్థ ప్రయత్నాలుండవు. ఐక్యరాజ్యసమితిలో మేము సభ్యులముగాబట్టీ, విజ్ఞాననిధి మాకు అందుబాటులోవుంది గాబట్టీ, ప్రపంచంలోని అత్యుత్తమ విజ్ఞానం మాకు లభ్యమౌతుంది" అని అనుకొంటున్నారు.

సాంకేతిక విద్యా ప్రచారంతో ప్రపంచంలోని భిన్నజాతుల వ్యక్తిత్వాలు నశిస్తాయనీ ప్రపంచమంతా అమెరికా మాదిరో, యింగ్లాండు మాదిరో వుండబోతుందని భయపడేవాళ్ళూ కొందరున్నారు. ఇది అసంభవమైన విషయం. ప్రతిజాతికి పూర్వము నుండీ వచ్చిన ఆచారాలూ పద్ధతులూ కొన్ని వున్నాయి. అవి ప్రజల జీవితంతో పెనవేసుకొని వున్నాయి. వారు మాట్లాడే భాషనూ, వారి వెంట్రుకల రంగునూ వారినుండి యెట్లు వేరు చేయలేమో వారి ఆచార వ్యవహారాలనుకూడా అట్లే వేరుచేయలేము. విజ్ఞాననిధిద్వారా జరిగే యిచ్చి పుచ్చుకోడాలలో పాశ్చాత్య ప్రభుత్వాలు బడుగుదేశాల ప్రజలను బాగుగా మనసులో పెట్టుకో

గలిగితే, ఆ ప్రజల జ్ఞానాన్ని జీవిత దృక్పథాన్ని కొంతవరకూ అవగాహన చేసుకోగలిగితే, ప్రపంచము బాగుపడదని యెవరస గలరు?

ఇది ప్రపంచంలో ఒక నూత్నవిషయం. ఇటువంటిదానిని చరిత్రలో యెవరూ చూడలేదు. సంవత్సరాలు గడిచేకొలదీ సాంకేతిక సహాయ సంస్థకు యింకాయెక్కువ అభ్యర్థనలు వస్తాయి. ప్రపంచముయొక్క సమైక్య విజ్ఞానం ప్రపంచ ప్రజల సేవకు వినియోగించే మార్గాలు యింకా యెక్కువౌతాయి.

ఆంగ్ల చరిత్రకారుడు, ఆర్నాల్డ్ జే టోయిన్‌బీ ఈ విధంగా వ్రాసినాడు.

"భవిష్యత్తులో మనయుగం జ్ఞాపకముండేది మహాభయంకర హింసవల్లా, మన అద్భుతమైన శాస్త్రఫలితాలవల్లా గాదు. నాగరికతలని సౌకర్యాలను మానవజాతి కంతటికీ అందుబాటులోకి తేవటం సాధ్యమనే సాహసం చరిత్రలో మొదటి సారిగా మస యుగంలోనే కలిగింది. ఈ సాహసం మూలంగానే మనయుగం జ్ఞాపక ముంటుంది.

---

శ్రీ లలితా ప్రింటర్స్, కడప.